కావ్యకంఠ

# శ్రీ గణపతిముని (నాయన)



ఆకార వదనం వంద్యాం
కవీనాం ఆదిమం కవిం
వందే గణపతిం దేవం

# విశ్వప్రకాశం

## ఆధ్యాత్మిక మాసపత్రిక

సెప్టెంబరు, 1996

సంపుటి : 2 సంచిక : 11 వెల : రూ. 5-00



ప్రకాశకులు
సర్వార్థ సంక్షేమ సమితి
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్
గాంధీనగర్, హైదరాబాద్ 500 380

ఈ సంచికలో ...

సంపాదకీయం

# శ్రీ రమణ విజయం

"అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచలా"

అరుణాచలానికీ భగవాన్ శ్రీరమణ మహర్షికీ అభేదం.

ఈ భూగోళంలో అత్యంత ప్రాచీనతమమైన గిరి అరుణాచలం.

దాని కెంతో ఐతిహ్యామైన చరిత్ర ఉంది.

అక్కడి శివుడి పేరు అరుణాచలేశ్వరుడు.

ఆ దేవాలయం ఎంతో విశాలమైనది. పరమ సుందరమైనవి ఆ దేవాలయ గోపురాలు.

ఆ ఆలయమే ఒక ఊరంత ఉంటుంది.

ఆ గోపురాలు ఆస్తికులను భక్తి భావ సంభరితులను చేస్తాయి

అరుణాచలం తిరువణ్ణామలైగా ప్రసిద్ధం.

అక్కడ భగవాన్ శ్రీరమణాశ్రమం ఉంది. రమణాశ్రమం తలచుకోగానే ఎందరో పులకించిపోతారు. శ్రీరమణుల కనుల తేజస్సౌందర్యానికి మించిన సౌందర్యం ప్రపంచంలోనే లేదన్నాడు హంఫ్రేస్ అనే పాశ్చాత్య భక్తుడు.

1896 వ సంవత్సరం సెప్టెంబర్ 1 వ తేదీన తెల్లతెల్లవారుతుండగా శ్రీరమణులు అరుణాచలంలో అడుగుపెట్టారు. పరుగుపరుగున దేవాలయంలో ప్రవేశించారు.

ఇంకా పూర్తిగా తెల్లవారలేదు.

సాధారణంగా ఆ సమయానికి తలుపులు తెరవరు.

కాని ఆ రోజు దేవాలయ మందిర ద్వారాలన్నీ తెరచి ఉన్నాయి.

అర్చకులు ఇంకా ఆలయంలోకి ప్రవేశించలేదు.

తమకంతో, సంతోషంతో పారవశ్యంతో 'తండ్రీ నీ పిలుపుకు కట్టుబడి నీ సన్నిధికి వచ్చాను' అన్నారు శ్రీ రమణులు. ఆయన ఇక అరుణాచలాన్ని విడిచిపెట్టలేదు.

55 సంవత్సరాలు అచల ప్రతిష్ఠితులై అక్కడే ఉండిపోయినారు.

ఈ సెప్టెంబర్ 1 వ తేదీకి ఈ దివ్య సంఘటన జరిగి ఒక శతాబ్ది.

శత సంవత్సరారాధనోత్సవం జరుగుతున్నది అరుణాచలంలో.

భగవాన్ శ్రీరమణ మహర్షి భారతదేశపు ఈ శతాబ్ది చరిత్రకే గొప్ప వెలుగు.

మధురకు ముప్ఫై మైళ్ళ దూరంలో తిరుచ్చుళి అనే గ్రామంలో 1879 వ సంవత్సరం శ్రీ రమణులు జన్మించారు. ఆయన తలిదండ్రులు అళఘమ్మ, సుందరమయ్యలు.

ఆయన చిన్నప్పటి పేరు వెంకటరామన్.

పందొమ్మిదో యేటనే ఆయనకు ఆత్మదర్శనం కలిగింది.

చిన్నప్పుడు ఆయనకు గాఢనిద్రలో శరీరపు ఉనికి పూర్తిగా విస్మృతమయ్యేది. పందొమ్మిదేళ్ళ వయస్సున ఆయన తొలిసారి 'అరుణాచలం' అనే పేరు విన్నారు. అప్పుడాయన మధురలో చదువుకుంటున్నాడు. వారింటి కొక రోజున ఒక బంధువు వచ్చారు. 'ఎక్కడి నుంచి వస్తున్నారు?' అని ఆయనను అడిగాడు వెంకటరామన్. 'అరుణాచలం' నుంచి అని చెప్పాడాయన.

'అరుణాచలం' అన్నపేరు చెవిన పడగానే ఆయన పారవశ్యానికి లోనైనారు.

చొక్కిపోయినారు. తన్మయావస్థను అనుభవించారు. ఆనందమయకోశంలో మేలుకొన్నారు. 'అరుణాచలమా, అది ఎక్కడ ఉంది?' అని అడిగారు.

'అరుణాచలం తెలియదా. అదే తిరువణ్ణామలై!' అని చెప్పారా బంధువు.

ఆ తర్వాత కొద్ది మాసాలకే వెంకటరామన్ ఇల్లు విడిచి అరుణాచలం చేరారు.

ఆ దేవాలయంలోనే ఆయన తపస్సు చేశారు.

హృదయకుహరంలో ప్రకాశించే ఆత్మజ్యోతిని ఆయన దర్శించారు.

ఈ లోకానికి జ్ఞాన ప్రదానం చేయటానికి ఆయన అవతరించారు.

భక్తిని ప్రసాదించటానికి ప్రభవించారు. ఆయన పరమశివుని పార్థివ తేజం. సాక్షాత్తు దక్షిణామూర్తి. మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వ విభవుడు.

1907లో గణపతి మునిగా విశ్రుతులైన అయల సోమయాజుల గణపతి శాస్త్రిగారనే మహాకవి, మహా పండితుడు, మంత్రద్రష్ట, ఋషి అరుణాచలంలో అచల స్వరూపుడైన మౌనస్వామిని దర్శించి జ్ఞానోపదేశాన్ని, తపఃస్వరూప సంసిద్ధిని

అనుగ్రహించవలసిందిగా అర్థించారు. అప్పుడు అప్రయత్నంగా మౌనస్వామి తమ మౌనం వీడారు. గణపతిమునికి తపస్స్వరూపం బోధించారు. ఆత్మనిష్ఠను ఉపదేశించారు. మంత్రద్రష్ట, స్రష్ట అయిన గణపతిముని శ్రీరమణుల అవతారతత్త్వాన్ని గ్రహించి 'భగవాన్ శ్రీరమణ మహర్షి' అని ఆయన నామాక్షరాలను మంత్రపూతంగా లోకానికి అనుగ్రహించారు.

అప్పటినుంచి శ్రీరమణ మహర్షి లోకాన్ని జ్ఞానమార్గంలో ఉద్బోధించారు. వారి ప్రబోధ సారాంశమంతా 'నేను' అంటే ఏమిటో అది ఎక్కడ తలయెత్తుతూ ఉన్నదో నిరంతరం గమనిస్తే మనస్సు స్వాధీనమై 'నేను' అనుభూతమవుతుందని. మనస్సు అణగిపోతే సుఖదుఃఖాల స్పర్శ ఏమీ ఉండదనే. ఈ విషయాన్నే కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని కాయన ఇట్లా ఉపదేశించారు.

" 'నేను' అను స్ఫురణము ఎందుండి వచ్చుచున్నదో విచారించినచో మనస్సు అందే లీనమగును. అదియే తపస్సు. జపము చేయునప్పుడు మంత్రనాదము ఎందు ఉదయించుచున్నదో పరికించినచో పరికించు మనస్సు అందు లీన మగును. అదియే తపము."

ప్రతి మానవుడు ఎంత చిన్నపని అయినా పెద్దపని అయినా చేస్తున్నప్పుడు చేయదలచినప్పుడు అతడు ఆ పని చేయటానికి ఆ కదలిక అతడిలె కలగటానికి అతడిలో ఏదో అంతర ప్రేరణ ఉంటుంది. కర్తృత్వభావన ఉంటుంది. ఏదో ఒక చైతన్యస్ఫురణ ఉంటుౝది. ఈ చైతన్యము ఈ స్ఫురణము ఈ కర్తృత్వము ఈ ప్రేరణ ఎక్కడ పుడుతున్నదో ఎక్కడ స్పందిస్తున్నదో ఏకాగ్రతతో కనిపెట్టటమే తపస్సని మహర్షి చెప్పేవారు. దీనిని సాధనచేస్తే అన్ని తలపులకూ మూలమైన నాదం ఎక్కడి నుంచి వెలువడుతున్నదో పరిశీలనగా గ్రహించటమే తపస్సని వారు బోధించేవారు.

ఎట్టి ఆలోచనమును రానీయక ఆలోచన ఉబికి నంతనే దాని పుట్టుక స్థానాన్ని గమనిస్తూ అక్కడే మనస్సు కేంద్రీకరించడం అభ్యసిస్తే మనసు క్రమంగా పలచబడిపోయి చివరకు లయమైపోయి 'నేను' శుద్ధచైతన్యంగా భాసిస్తుందనీ, శుద్ధచేతనమైన 'నేను' అనే స్ఫూర్తి ఎప్పుడైతే కలుగుతుందో అదే ఆత్మ సాక్షాత్కారమనీ పండితులు ఈ ధ్యానసాధన క్రమాన్ని వివరించారు. ఇంతకంటే గొప్ప తపస్సు లేదని, జపం లేదని శ్రీరమణుల సరళ ప్రబోధం.

వారు ఊరూర తిరిగి ప్రచారంచేయలేదు. ప్రత్యేకించి ఎవరికీ మంత్రదీక్ష ఇవ్వలేదు. సన్యాసాశ్రమ స్వీకారం చేయవలసిందని బోధించలేదు. అత్యంతాసక్తితో రోజూ పత్రిక చదివేవారు. దేశ రాజకీయాల పట్ల కుతూహలం కనపరచేవారు. అందరితో పాటు తాము కూడా ఏదో ఒక పనిలో నిమగ్నమయ్యేవారు. ఆశ్రమం వంటశాలలో కూరలు తరిగేవారు. పుస్తకాలకు అట్టలు కట్టి అందంగా సిద్ధం చేసేవారు. అద్వైతసిద్ధి యొక్క పరమార్థ స్వరూపంగా శ్రీరమణ మహర్షి ఈ శతాబ్ది భారతీయ వేదాంత సంస్కృతిని పునరుజ్జ్వలితం చేశారు. శ్రీరమణులకు శ్రీరామకృష్ణపరమహంసకు పోలికలున్నవి. జ్ఞానులలో తరతమాలుండవని శ్రీరమణ మహర్షి చెప్పారు. అయితే శ్రీరమణులు తండ్రి బిడ్డడు. శ్రీరామకృష్ణులు తల్లిబిడ్డడు. శ్రీరమణులు మొదట జ్ఞాని. తర్వాత భక్తుడు. శ్రీరామకృష్ణులు మొదట భక్తుడు. తర్వాత జ్ఞాని. అయితే భక్తి జ్ఞానాలు వేరు వేరు కావు. రెండూ ఒక్కటే అని ఇద్దరూ చెప్పారు.

'అహం మూలాన్వేషణం' వల్లనే అన్ని సిద్ధులు ఒనగూరుతాయి అంటారు శ్రీరమణ మహర్షి. ఆయన శ్రీ వాసిష్ఠ గణపతి కిట్లా ఆశ్వాసం కలిగించారు. 'ఈశ్వరునిపై భారము వేయుడు. మీ భారములు తొలగును. తన కర్తవ్యము ఆయనకు తెలియును.' శ్రీరామకృష్ణ పరమహంస ముఖ్య ప్రబోధం కూడా ఇదే.

పందొమ్మిది ఇరవై శతాబ్దాలలో భారతదేశంలో పరమయోగులు, మహర్షులు, జ్ఞానధనులు, తత్త్వవేత్తలు, దివ్యతపస్వులు ప్రభవించటం ఆశ్చర్యకరమైన విషయం. పతనోన్ముఖమైన భారతీయ విచారధారను, సంస్కృతిని దాస్యశృంకలాబద్ధమైన భారతీయ జాతిని, దేశాన్ని రక్షించటానికి విశ్వమానవాళినే సంరక్షించటానికి భగవత్సంకల్పంతో చిత్కళామూర్తులుగా వీరంతా జన్మించారని అవగతం చేసుకోవాలి.

వీరంతా ప్రాచీనమైన భారతీయ సంస్కృతిని వేదాంతదర్శనాన్ని పునరుద్ధరించారు. మూర్తిపూజను, దేవాలయవ్యవస్థను కాదనలేదు. బలపరచారు. ప్రచారం చేశారు. స్తోత్రవాఙ్మయాన్ని సమాదరించారు. భజనకూటాలను ప్రోత్సాహపరిచారు. నిత్యనైమిత్తక కర్మకాండను నిరసించలేదు. శ్రుతి, స్మృతులను ప్రమాణంగానే భావించారు.

ఏదిఏమైనా తిరుచ్చులిలో 1879 వ సంవత్సరంలో జన్మించిన భగవాన్ శ్రీరమణమహర్షి పద్ధెనిమిదేళ్ళ వయసుననే ఆత్మదర్శనులై 1896 వ సంవత్సరం

సెప్టెంబర్ 1వ తేదీన అరుణాచలం చేరి అక్కడనే విరాజితులైనారు. 55 సంవత్సరాలపాటు ఆయన అక్కడ ఆర్తులను అనుగ్రహించారు. తమ దివ్యతేజస్సును ప్రసరణం చేశారు. 1950 ఏప్రిల్ 14వ తేదీన తమ భౌతికాన్ని ఉపసంహరించుకొని అరుణగిరియందు అంతర్హితులైనారు.

ఈ సెప్టెంబరు 1 వ తేదీకి భగవాన్ తిరువణ్ణామలైలో పాదం మోపి నూరు సంవత్సరాలు పూర్తి కావటం'విశ్వప్రకాశం' శ్రీరమణ విజయ శత జయంతి నివాళిని సమర్పిస్తున్నది.

*'కాంత మినుమును వలె గలిసినన్ విడువక*
*కలసి నాతో నుండు మరుణాచలా'*

'ఇనుమును తన అయస్కాంత శక్తితో ఆకర్షించి దగ్గరకు లాగుకొని విడువని అయస్కాంతము వలె బహిర్ముఖమయ్యే నా మనస్సును నీ **అనుగ్రహశక్తిచే ఆకర్షించి** అంతర్ముఖం చేసి **విడువక నాతోనే** కలసి వుండుము అరుణాచలా.'

- భగవాన్ శ్రీరమణమహర్షి విరచిత
అక్షర మణిమాల నుంచి

"మనుష్యునకు జ్ఞానం కలిగిన వెనుక ఈ శరీరం మీద లక్ష్యం ఉండదు. ఎంత చక్కని విస్తరిగానీ భోజనానంతరం విసరి పారవేసినట్లు ఈ భౌతిక శరీరం జ్ఞానోదయానంతరం ఎప్పుడు పారవేద్దామా అని చూస్తాడు."

- శ్రీ రమణ మహర్షి

***"లోకమంతా ఈశ్వరమయంగా ఎవరు చూస్తారో వారిని ఈశ్వరుడని లోకం పూజిస్తుంది."***

***- శ్రీ రమణ మహర్షి***

# శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి

- అక్కిరాజు రమాపతిరావు

ఈ శతాబ్ది భారతదేశాన్ని ప్రభావితం చేసిన ఆధ్యాత్మిక మహాపురుషులలో, సనాతన ధర్మ ప్రతిష్ఠాపనాచార్యులలో, ఈకాలపు చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాముల వారు ప్రముఖులు. వీరినే నిన్న మొన్నటివరకు కంచిపరమాచార్యుల వారని భారతీయులు గౌరవించారు. వీరు ఇంచుమించు నూరేళ్ళు జీవించారు. తమ ప్రబోధాలతో ఆధునిక భారతదేశాన్ని పునరుజ్జీవితం చేశారు. వీరిని గూర్చి ఇంగ్లీషు, తెలుగు, తమిళ భాషలలో చాలా గ్రంధాలు వచ్చాయి. తెలుగులో వచ్చిన అటువంటి గొప్ప గ్రంధాలలో 'మా స్వామి' అనే గ్రంథం ఒకటి. ఈ గ్రంధంలో శ్రీ కంచి పరమాచార్యులవారి జీవిత చరిత్ర, వారు సాగించిన ఆధ్యాత్మిక దివ్యతపో యాత్రలు, వారుకావించిన ప్రబోధాలు, వారిని దర్శించుకున్న దేశ, విదేశ 'ఆర్తోరర్ధార్ధి జిజ్ఞాసువు'ల అనుభవాలు, అనుభూతులు, చరితార్ధతలు, పొందిన ప్రేమ, శాంతి, ఆనంద, అభయ సంఘటనలు చక్కగా వర్ణితమై ఉన్నవి. ఇటువంటి గ్రంథమే కీ.శే. నీలంరాజు వేంకట శేషయ్యగారు రచించిన 'నడిచే దేవుడు' అనే గ్రంథం కూడా. 'మాస్వామి' అనే గ్రంధంలో 'విశాఖ' అనే కలంపేరుతో ఒక గొప్ప ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నులు, సాధకులు శ్రీ కంచి పరమాచార్య స్వామిని గూర్చి ఇట్లా వ్రాశారు.

"ఆచార అనుష్టానాలు ఉన్నంత మాత్రాన ఒక వ్యక్తి మహాత్ముడైపోడు. అతనిలో ఒక దైవ చైతన్యం దర్శిస్తే కాని మన ఆత్మలు ఉపశమించటం లేదు. ఆ వ్యక్తికి అనుగ్రహశక్తి కూడా వుండాలి. ఇట్టి భగవచ్చైతన్యం, వైదుష్యం,కరుణ, తపస్సు, శిశుసారళ్యం, భక్త సులభత కంచిస్వామిలో చాలామందికి కనిపిస్తుంది. ఈ కారణంగా వారిని చూచినవారూ, చూడనివారూ వారి గుణగానం చేస్తారు.

ఆయన గంటల కొద్దీ పూర్వం పూజచేసేవారు. గంటల కొలది అవిరామంగా దర్శనమిచ్చి ఆశ్రితులను అనుగ్రహించేవారు. గంటల కొలది ధ్యాననిమగ్నులయ్యేవారు. ఇవి చాలవన్నట్లు వివిధ గ్రంథాధ్యయనం, శాస్త్రాన్వేషణ వారికి ఒక అనివార్య వ్యసనం. ఈ కార్యక్రమానికి కాలమూ,శక్తీ ఎక్కడ నుంచి సంపాదించేవారో దేవునికే తెలియాలి. ఊరూరు తిరుగుతూ ఎనభై ఏళ్ళుగా జ్ఞానబోధం చేస్తున్న మా స్వామి వాగ్దేవతాస్వరూపులు.'

శ్రీ కంచికామకోటి పీఠాన్ని ఆదిశంకర భగవత్పాదుల వారే స్థాపించారని ఐతిహ్యం చెపుతున్నది. ఆయన అక్కడే అవతారం చాలించారని కూడా ఒక నమ్మకం. కంచిలోని పీఠాన్ని సర్వజ్ఞపీఠమంటారు. ఈ పీఠానికి 68వ అధిష్ఠాత శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి. శ్రీ స్వామివారు 1894 వ సంవత్సరంలో జన్మించారు. 1994వ సంవత్సరంలో అవతారపరిసమాప్తి గావించారు. స్వాములవారు సన్యాసం తీసుకొన్నప్పుడు వారికి పదమూడేళ్ళే. బహుశా సంసారమనే పదానికి అర్థం కూడా తెలియని ప్రాయమది. స్వాములవారి పూర్వాశ్రమనామధేయం స్వామినాధన్. తండ్రిగారి పేరు సుబ్రహ్మణ్యశాస్త్రి. తల్లి గారి పేరు మహాలక్ష్మి.

వీరిది హోయసల కర్ణాటక స్మార్త బ్రాహ్మణ కుటుంబం. వీరి కుటుంబ పూర్వీకులు వచ్చి అరవదేశంలో స్థిరపడ్డారు. స్వాములవారి తండ్రి గారైన సుబ్రహ్మణ్య శాస్త్రి అధ్యాపక వృత్తిని స్వీకరించారు. స్వామినాధన్ పుట్టినప్పుడు తండ్రిగారు విల్లుపురంలో ఉద్యోగం చేస్తున్నారు. సుబ్రహ్మణ్య శాస్త్రిగారి ఇష్టదైవమూ ఆ కుటుంబం వారి కులదైవమూ కుంభకోణం సమీపంలోని స్వామిమలలోని స్వామినాథుడు. అందువల్ల తమ సంతానానికి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ ఇష్టదైవం పేరే పెట్టుకున్నారు. స్వామినాధన్ జననం మే 20 వ తేదీ, 1894 వ సంవత్సరం. అంటే జయనామ సంవత్సర వైశాఖ బహుళ పాడ్యమి. అవాళ ఆదివారం, అనూరాధ నక్షత్రం, సింహలగ్నం శ్రీ స్వామివారిది. స్వామివారి మాతామహుల పేరు శ్రీ నాగేశ్వర శాస్త్రి. ఈయన ఋగ్వేద మంతా సలక్షణంగా కంఠపాఠం చేసినవారు. పితామహులు గణపతి శాస్త్రి. వీరు కూడా సాంగముగా ఋగ్వేదాన్ని అధ్యయనం చేశారు. షడ్దర్శన పండితులు.

1899 వ సంవత్సరం అంటే స్వామి వారికి ఐదేళ్ళ వయస్సున ఒక అద్భుత సంఘటన జరిగింది. సుబ్రహ్మణ్య శాస్త్రిగారప్పుడు 'పోర్టునోవో' అనే చోట ఉపాధ్యాయులుగా ఉన్నారు. చిదంబరం అక్కడికి సమీపమే. చిదంబరక్షేత్రంలో ఇలైమైక్కినార్ దేవాలయంలో ఆ యేడు కుంభాభిషేకం జరుగుతున్నది. తండ్రితో పాటు స్వామినాధన్ కూడా కుంభాభిషేకం చూడాలన్న కుతూహలంతో వెళ్ళారు. వెంకటపతి అయ్యర్ అనే వారింట్లో తండ్రీ కొడుకులు విడిది చేశారు. 'నిద్రపోయినా, కుంభాభిషేకానికి నిద్రలేపి నిన్ను తీసుకొని వెళతాన'ని తండ్రి బుజ్జగించి చెప్పటంతో, స్వామినాధన్ నిద్రపోయాడు. తెల్లగా తెల్లవారిన తర్వాత లేచి తండ్రి మాటను నిలబెట్టుకోలేదని స్వామినాధన్ విచారించాడు. అయితే ఆ రాత్రి ఆ ఇంట్లో వారెవరూ ఆలయానికి వెళ్లలేదు. ఆరోజు

రాత్రి ఆలయంలో ఘోర అగ్నిప్రమాదం సంభవించింది. చాలామంది చనిపోయారుకూడా.

'పోర్టునోవో'లో ఆ రా॥ స్వామినాథన్ తల్లిగారైన మహాలక్ష్మమ్మ గారికి చిదంబరం దేవాలయంలో అగ్నిప్రమాదం జరిగినట్లు కల వచ్చింది. ఆమె ఆత్రుతతో రైల్వేస్టేషన్‌కు వెళ్లింది. చిదంబరం నుంచి వచ్చే యాత్రికులెవరైనా కనపడతారేమోనని. ఆమెకు రైల్వేస్టేషన్‌లో తండ్రీ, కొడుకు ఎదురు కావడంతో పరమానందం పొందింది. ఈ విధంగా ఆ తల్లి స్వప్నమూ, చిదంబర దేవాలయ ప్రమాదమూ శ్రీ స్వామినాథన్ ఈ లోకంలో ఎందరినో ప్రమాదాల నుంచి రక్షించటానికి అవతరించిన వారన్న విషయం తెలుపుతున్నాయి.

1900 వ సంవత్సరంలో స్వామినాథన్ ఒకటో తరగతి చదువుతుండగా పాఠశాలాధికారి పర్యవేక్షణకు వచ్చి ఆ పై తరగతి ఇంగ్లీషు పుస్తకం స్వామినాథన్‌ను చదవమని కోరడం, ఆయన గడగడ చదవడం చూసి మూడోతరగతికి వెంటనే ఆయన్ను మార్పించారు.

1905లో శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి తిండివనం బదిలీ అయింది. శ్రీ స్వామినాథన్‌కు ఆ యేడే ఉపనయనం జరిగింది. కంచికామకోటి పీఠం 66వ ఆచార్య స్వామివారు అప్పుడు తిండివనం సమీపంలో పర్యటిస్తూ నూతన వటువుకు ఆశీస్సులందజేశారు. ఈ బాలుడే తమ తర్వాత పీఠానికి ఆచార్యులవుతారని ఆయన అప్పుడే సంకల్పించారేమో! ఆ స్వాముల వారిపేరు కూడా శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి. ఆ యోగ పట్టాన్నే తర్వాత శ్రీ స్వామినాథన్ స్వీకరించారు.

పదేండ్లవయసున శ్రీ స్వామినాథన్ తిండివనంలో ఆర్కాట్ మిషన్ స్కూలులో సెకండ్‌ఫారం చదువుతున్నారు. చదువులో అన్ని బహుమతులూ ఆయనవే. అఖరుకు బైబిలు పాఠాలు అప్పగించడంలోనూ ఆయనదే ప్రథమ బహుమానం. 1906లో శ్రీ స్వామినాథన్ ఫోర్త్‌ఫారంలోకి వచ్చారు. ఆ సంవత్సరం స్కూలు వార్షికోత్సవానికి షేక్స్‌పియర్ విరచిత 'కింగ్‌జాన్' నాటకంలో కొన్నిదృశ్యాలు ప్రదర్శించాలని ఉపాధ్యాయులు కుతూహల పడ్డారు. అందులో ప్రధాన పాత్ర ప్రిన్స్ ఆర్థర్. ఈ పాత్రకు సరి అయిన వ్యక్తి దొరక్కపోగా ప్రధానోపాధ్యాయులవారు శ్రీ స్వామినాథన్‌ను ఆ పాత్ర ధరించవలసిందని ఎన్నిక చేసి ఒప్పించారు. ఆ పాత్రధారణ చేసి శ్రీ స్వామినాథన్ అందరి మెప్పు సంపాదించారు. ఉపాధ్యాయులంతా వచ్చి శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రి గారినెంతగానో అభినందించారు.

1906 వ సంవత్సరం కంచి కామకోటి పీఠాధిపతులైన శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారు తిండివనానికి సమీపాన చాతుర్మాస్యవ్రతం నిర్వహించారు. తల్లిదండ్రులకు చెప్పకుండానే శ్రీ స్వామినాథన్ వెళ్ళి శ్రీ స్వామివారిని దర్శించారు. అప్పుడు స్వామివారు స్వామినాథన్‌ను మఠంలో ఉండిపోవలసిందిగా కోరగా తల్లిదండ్రులకు చెప్పిరాలేదని తెలిపి శ్రీ స్వామి వారి అనుమతితో శ్రీ స్వామినాథన్ ఇల్లు చేరుకున్నారు. కాని భవితవ్య నిర్ణయం అప్పుడే జరిగిపోయింది. 66వ ఆచార్యులవారు కంచికి సమీపంలోని కలువై అనేచోట సిద్ధి పొందగా శ్రీ స్వామినాథన్ పెదతల్లిగారి కుమారుడిని - అప్పటికాయన కంచి మఠంలో చదువుకుంటున్నారు- పీఠాధిపతిని చేశారు. అయితే వారు వారం రోజులలోనే ఆయన సిద్ధి పొందగా మఠాధికారులు శ్రీ స్వామినాథన్ తండ్రిగారికి తంతి వార్త నిచ్చి వారి అనుమతిని పొంది 1907 ఫిబ్రవరి 13 వ తేదీన శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి అనే యోగపట్టంతో శ్రీ స్వామినాథన్‌ను 13వ ఏట కంచికామకోటి పీఠాధిపతిని చేశారు. ఆనాటి నుంచి 87 సంవత్సరములు శ్రీ పరమాచార్యప్రభువులు భారతీయ విజ్ఞానాన్ని, సంస్కృతిని, ఆధ్యాత్మిక పురావైభవాన్ని పునరుద్ధరించి సుప్రతిష్ఠితం చేసే కార్యక్రమంలో నిమగ్నమైనారు. వారి దివ్యతపఃతేజో పరివేష మండలం అర్హులైన వారిని, ఆ అధికారం కల వారిని ఎందరినో ఆకర్షించి అట్టివారికి అభయప్రదానం చేయటం అందరూ ఎరిగిన విషయమే.

ఆనాటి కొన్ని రాజకీయ అస్థిర ఆందోళన పరిస్థితుల వల్ల పద్ధెనిమిదో శతాబ్దపు చివరి దశకంలో (1783) కంచికామకోటిపీఠం కేంద్రస్థానం కుంభకోణానికి తరలించటం జరిగింది. అందువల్ల 1907 వ సంవత్సరంలో 68వ పీఠాచార్యులైన శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారు కుంభకోణాన్ని తమ కేంద్రస్థానంగా చేసుకున్నారు. ఆనాటి నుంచి 73 చాతుర్మాస్య దీక్షలు నిర్వహించగా చివరిది 1979లో బెల్గాంలో నిర్వహించారు. ప్రయాగ, కలకత్తా, చిత్తూరు, గుంటూరు, బరంపురం, సికింద్రాబాదు మొదలైనచోట్ల శ్రీ పరమాచార్యులు చాతుర్మాస్య దీక్ష వహించి ఎందరినో కృతార్థులను చేశారు.

1909లో శ్రీ స్వాముల వారి వయస్సు పదిహేను సంవత్సరాలు. కుంభకోణం మఠంలోనే స్వాములవారు రెండేళ్ళు కావ్యనాటకాలంకారాలు చదివారు. అటు తరవాత వేదవిద్యలు అకుంఠితంగా చదవటానికి అఖండ కావేరీ ఉత్తర తీరాన

మహేంద్ర మంగళం సరియైన ప్రదేశమని నిర్ణయించి మరం పండితులు 1911 నుంచి 1914 దాకా శ్రీ స్వామివారి వేదశాస్త్రాధ్యయనం సాగింపచేశారు. సంగీతం, గణితం, జ్యోతిష్య విద్యలలో కూడా శ్రీ స్వామి వారు పురిపూర్ణ పాండిత్యం సముపార్జించారు. ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలలో కూడా వారికి తగిన పరిచయం ఉంది. 1915 మే నెలకు శ్రీ స్వామి వారి వయస్సు 21 సంవత్సరములు పూర్తికావడం వల్ల కంచికామకోటి పీఠం అధికారాలు, వ్యవహారాలు అన్నీ స్వామివారే ప్రత్యక్షంగా నిర్వహించుకుంటూ 1932లో స్వామి వారు మద్రాసు నగరం వేంచేశారు. స్వామివారు చాలావరకు కాలినడకనే యాత్రచేసేవారు. 1933 వరకు దక్షిణ దేశంలోని పెక్కుపుణ్య క్షేత్రాలు దర్శించారు. ఇక అప్పుడు ఉత్తర భారత యాత్రలకు బయలుదేరారు. మొట్టమొదట శ్రీశైలం దర్శించి అక్కడ నుంచి హైదరాబాదు మీదుగా నాగపూర్ వెళ్ళి అక్కడ నుంచి జబ్బల్‌పూర్‌లో నర్మదలో స్నానం చేసి 1934లో ప్రయాగ చేరారు. రామేశ్వరం నుంచి తెచ్చిన ఇసుకను త్రివేణీ సంగమంలో స్వామి వారు అర్పించారు. ప్రయాగ నుంచి కాశీకి 80 మైళ్ళు స్వామివారు కాలినడకనే వెళ్ళారు. కాశీ మహారాజావారు, వారణాసి హిందూ విశ్వవిద్యాలయ ప్రముఖులు, మదనమోహనమాలవ్యా పండితులు స్వామివారికి ఘనస్వాగతం పలికారు. ఊరేగింపుగా స్వామివారిని వారణాసిలో ప్రవేశపెట్టారు. ఆ ఊరేగింపులో లక్షమంది పాల్గొన్నారు. అక్కడ నుంచి పాట్నా చేరి, గయను సందర్శించారు. 1935లో కలకత్తా చేరారు. బరంపురం, విజయనగరం, సింహాచలం మీదుగా 1938లో గుంటూరు చేరారు. నెల్లూరు, కాళహస్తి, తిరుపతుల మీదుగా 1939లో కాంచీపురం చేరారు. 1938లోనే రామేశ్వరం సందర్శించి త్రివేణీ నుంచి తెచ్చిన గంగాజలంతో రామనాథేశ్వరునికి అభిషేకం జరిపారు. శ్రీవారి విజయయాత్ర కాలము ఇరవై ఒక్క సంవత్సరములు. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారు సనాతన ధర్మప్రచారం కోసం ఎంతో కృషి చేశారు. వేదపాఠశాలలు స్థాపించి వేదాధ్యయనం విశేషించి ప్రోత్సహించారు.

1954 మార్చి 22న శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారిని శిష్యులుగా స్వీకరించారు. శ్రీ స్వామి వారి బోధలు 13 సంపుటాలుగా తెలుగులో వెలువడ్డాయి. తెనాలిలోని సాధన గ్రంథ మండలి వారు వీటిని ప్రచురించారు. శ్రీ కంచి కామకోటి పీఠ జగద్గురువులలో 68 వ వారైన శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు అధునిక కాలాన ఆదిశంకరుల అవతారమే నని కీర్తితులైనారు.



# శ్రీ వల్లభ చరితామృతం

మూలం :
శ్రీ కళాధరభట్

అనువాదం :
డా॥ తిరుమల రామచంద్ర

*(కిందటి సంచిక తరువాయి)*

## సేవ్యమూర్తుల పంపకం

శ్రీ విఠలేశ్వరుని వద్ద శ్రీనాథ విగ్రహంతోపాటు ఎనిమిది సేవ్యమూర్తులు - పూజావిగ్రహాలు - వుండేవి. వాటిని ఆయన తాను బ్రతికి ఉన్నప్పుడే క్రమంగా శ్రీగిరిధారీ మొదలయిన తన కుమారులకు పంచియిచ్చారు. ఇక మిగిలింది శ్రీనాథ విగ్రహం. ఈ శ్రీనాథ విగ్రహం ఎవరి వద్ద ఉండేది? ఈ ప్రశ్నను, దాని ఔచిత్యాన్ని శ్రీమత్ప్రభు చరణులు శ్రీనాథుని మీదే వదలిపెట్టారు. శ్రీనాథుడు తన ఇచ్ఛతో జ్యేష్ఠ పుత్రుడైన శ్రీగిరిధరుల చేయిపట్టుకున్నారు. అప్పటినుంచి శ్రీగిరిధారి వంశంవారే శ్రీనాథుని సేవ చేస్తున్నారు. ప్రస్తుతం ఉన్న పీఠాధిపతి ఈ వంశపు 13వ తరంవారు. శ్రీనాథునిలోను, శ్రీమద్వల్లభాచార్య వంశజులలోను ఏకరూపత ఉన్నది. వీరిలో భేదబుద్ధి చూపే వైష్ణవులు సర్వనాశమయిపోతారని చెప్పబడింది. తత్త్వం విదిత్వా పరమం యశోదోత్సంగ లాలితమ్, శ్రీమదాచార్య తత్పుత్రాన్ హిత్వాస్మత్స్వామినీరపి, తత్తుల్య బుద్ధ్యావాశః స్యాత్ సర్వధేతి వినిశ్చయః' శ్రీహరి మహాప్రభు.

## వల్లభవంశమూ - భగవంతుడూ

వల్లభుల వంశం శ్రీనాథుని సొంతవంశం. శ్రీమద్వల్లభులు భగవద్వదవతారులు, అలౌకిక అగ్ని స్వరూపులు, అందువలన వారి వంశీయులు భగవంతుని ఆత్మీయబంధువులుగా పరిగణింపబడుతున్నారు. ఈ వంశము భగవంతునితో సాక్షాద్దేహ సంబంధం పెట్టుకోవడం వల్ల భగవద్వంశంగా పరిగణితమైంది. ఈ అభిప్రాయమే శ్రీహరిరాయ మహాప్రభువుల పరమకారుణికమూ, అపార్థివమూ అయిన వాక్కులో ఈ విధంగా అభివ్యక్తమయింది : 'నిజాచార్య కులం నాథ! స్వకులత్వేన మన్యసే, అతోస్మాన్ తత్సముద్భూతాన్ దీనాన్ తథ ముపేక్షసే నాథ! త్వదాననాత్మానం స్వయమగ్ని మలౌకికమ్, సంబంధాస్తు కథం దుష్టాః స్థితా ఇతి విచారయ, భావేన నవయంనాథ! భవదీయాస్తు యద్యపి, తథాపి దేహ సంబంధాత్ యతత్స్వదనాగ్నిజాః' "ఓ స్వామీ! మీరు శ్రీమద్వల్లభాచార్యుల కులాన్ని స్వకులంగా భావించేటట్లయితే, మరి ఆ

కులంలోనే పుట్టిన దీనులైన మా యెడల మీకెందుకు ఉపేక్ష? మీ ముఖ కమలం నుంచి పుట్టిన అలౌకికాగ్ని వంశం వారే మేమూను. మరి మేము దోష సహితులము ఎట్లా అయ్యాము? 'భావం'తో మేము మీవారం కాదని ఒప్పుకుందాం. అయినా మీతో మాకు దేహ సంబంధం తప్పకుండా వుంది. ఎందుకంటే మేము మీ వదనాగ్ని నుంచే పుట్టినవారం.' శ్రీహరిరాయ ప్రభువుల విజ్ఞాపనం ఎంత అద్భుతంగా వుంది!!! శ్రీవల్లభాచార్యుల వంశం విషయమై శ్రీవల్లభుల, శ్రీప్రభుచరణుల అభిప్రాయాలకు ఇదొక భావనామయమైన, పరమోజ్జ్వలమైన చిత్రణం.

## వల్లభులకు, వారి వంశానికి శ్రీనాథునితో ఆత్మీయత

వల్లభసంప్రదాయం సేవామార్గమని వ్యవహరింపబడుతున్నది. ఈ సేవామార్గాన్ని స్థాపించడానికి, స్వకీయ ఆచరణ ద్వారా ఆ మార్గంలోని క్రియాత్మక స్వరూపాన్ని ఉపదేశించడానికిగానే సాక్షాత్పూర్ణ పురుషోత్తముడే సేవ్యసేవక - ద్వివిధరూపంలో అవతరించాడు. (4 వై.వా. పుట. 9). పురుషోత్తముడు శ్రీనాథుని రూపంలో సేవ్యుడుగను, శ్రీమదాచార్య రూపంలో సేవకుడుగను అయ్యాడు. తన సేవను తనతోనే చేయించడానికి ('ఆపున సేవా కరనే ఆపుతే') ఆ 'ప్రథిత' (ప్రసిద్ధ) పురుషోత్తముడు ఒకే తేజఃపుంజం రెండు కిరణాలుగా విభక్తమయినట్లు సేవ్య సేవకులనే రెండురూపాలతో అవతరించాడు. 'రూపబే ఊ ఏకతే భిన్న ధఈ విస్తరే - లీలాకరే - భజన సారేపి కవి గోపాలదాస్'. ఈ కారణం వల్లనే వల్లభులు పరబ్రహ్మ రూపంతో స్వీయపరిచయం తెలుపుతూనే, తమను 'కృష్ణ'ని 'దాసు'లమనీ చెప్పుకున్నారు - ఇతి 'శ్రీకృష్ణ దాసస్య వ్లభస్య' ఇత్యాదిగా. ఈ విధంగానే కృష్ణభగవానుడు పరబ్రహ్మ అయినప్పటికీ తనను భక్తపరాధీనుడని చెప్పుకున్నాడు - 'అహం భక్త పరాధీనః'. నిజానికి ఇదంతా స్నేహ పరాకాష్ఠలోనే సంభవిస్తుంది. అటుతర్వాత సేవ్యత్వ సేవకత్వాలనే పరస్పర విరుద్ధమైన రెండుగుణాలు పరబ్రహ్మలోనే సంభవమని అన్నారు - 'పరస్పరవిరుద్ధం బ్రహ్మణ్యేవ సంభవతి' విద్వన్మండనమ్. పరబ్రహ్మ విరుద్ధ గుణాలకు ఆశ్రయంగా చెప్తారు. అందువల్ల వల్లభులు 'దాసు'లు అవుతూనే, 'భగవాను'లు కూడా అవుతున్నారు. భగవంతుడు భగవంతుడైనా దాసపరాధీనుడు అవుతున్నాడు. సేవ్యసేవకుల పరస్పర చరితార్థతలోనే వల్లభకులం ఉనికి ఉన్నది. సేవ్యసేవక ధర్మమే సేవామార్గం. సేవామార్గపు ఉపదేశ విస్తారాలే వల్లభకుల ధర్మం అవుతున్నది.

## శ్రీనాథుడు వల్లభకులానికి కులదేవత (ఇలవేల్పు)

చంపారణ్యంలో వల్లభులు అవతరించిననాడే గోవర్ధన పర్వత శిఖరం మీద

శ్రీనాథుని ముఖకమలం వ్యక్తమైందని ఈ సంప్రదాయంవారు విశ్వసిస్తున్నారు. ఈ విశ్వాసానికి మొదటి కారణం వల్లభులు భగవంతుని సాక్షాన్ముఖవతారమనే విశ్వాసం. రెండవకారణం ఆ ఏకైక పరబ్రహ్మ సేవ్యస్సేవకరూపంలో సేవామార్గపు ఆచరణాత్మక స్వరూపాన్ని చూపడానికి ఏకకాలంలోనే వల్లభులుగను, శ్రీనాథుడుగను అవతరించారనేది. వల్లభులు స్వయంగా గోవర్ధనపర్వతం మీదికి వెళ్లి శ్రీనాథ విగ్రహాన్ని వెలువరించి, అక్కడ దానిని ప్రతిష్ఠించి, అప్పటినుంచే దాని సేవ ప్రారంభించారు. అందువల్ల వల్లభకులానికి ముఖ్యమైన సేవ్యస్వరూపం శ్రీనాథుడు. శ్రీనాథుడే వల్లభుల సర్వస్వం. ఈ అభిప్రాయాన్నే వల్లభులు గోవర్ధనగిరి శిఖరంపై శ్రీనాథుని వ్యక్తం చేసినప్పుడు అక్కడ సమావేశమైన తమ సేవక సముదాయం ముందు ప్రకటించారు. 'సాఛే ఆపనే సదుపాండేసో తథా మానక ఛంద్ పాండేసో ఔర అన్యోరమే జోసేవక్ భయే హతే. తిన్ సబ్ నసో కహీ 'జో మేరో యహ్ సర్వస్వహై' (ని.వా.పుట.13) (తర్వాత వారు సదుపాండే, మానక్‌చంద్ పాండేలతోను, అట్లే ఎవరెవరు సేవకులయ్యారో తక్కిన వారందరితోను ఇది నా సర్వస్వం అని అన్నారు.) చౌరాసీ వైష్ణవ వార్తా - అనే గ్రంథంలోను అంతటా ఈ కథనమే ఉంది - 'ఔర్ ఆచార్యశ్రీకో సర్వస్వధన శ్రీనాథ ఓహై'' (మరిన్ని ఆచార్యులకు సర్వస్వధనం శ్రీనాథులే.)

ఇటువంటి దృఢమైన సహజమైన విశ్వాసమే దోసోబావన్ వైష్ణవనకీ వార్తా అనే గ్రంథంలోను ప్రతిచోట కనిపిస్తుంది. - 'తాతే శ్రీకృష్ణావతార సబ్ అవతారన్ మే హమారో సర్వస్వ హై సేవ్యహై'. అందువలన సకలావతారాలలోను కృష్ణావతారం మాకు సర్వస్వము, సేవ్యమూను.) ఈ భావమే వల్లభులే స్వయంగా కూర్చిన తమ భాగవత వ్యాఖ్యానమైన సుబోధిని మంగళాచరణ శ్లోకంలోను చూడవచ్చు. 'వందే శ్రీకృష్ణదేవం యః సనో భూతిహేతుః' ఇక్కడ భూతి అనే పదానికి 'సర్వస్వ-ధన' మనే అర్థం. 'కృష్ణావతారః పతిః' కృష్ణావతారం నాకు 'పతి'. భక్తకవి అయిన కృష్ణదాసు శ్రీనాథుని వల్లభుల 'పతి' అన్నాడు. - 'జబసే భేంటభఈ శ్రీవల్లభ నిజపతినామ బతాయో! (నాకు శ్రీవల్లభులతో భేటీ అయినప్పటినుంచి తమ పతి పేరు తెలిపారు.) శ్రీనాథుడు వల్లభ వంశానికి 'కులదేవత', 'కులపతి' అయ్యాడు. ఈ భావననే శ్రీమత్ప్రభు చరణులు తమ 'విద్వన్మండనమ్' అనే గ్రంథంలో వ్యక్తం చేశారు. 'ఏతేనా స్మత్కులపతిః శ్రీగోపీజనవల్లభః, ప్రీతోస్త్వస్మాసుతేనైవ పూర్ణతాకి మిహా పరైః' (దీనితో మ కులపతి అయిన శ్రీగోపీజనవల్లభుడు మాపై ప్రసన్నుడగుగాక! దానితోనే మాకు

పరిపూర్ణత్వం. ఇతరుల సంగతి ఎందుకు?) శ్రీహరిరాయజీ మహాప్రభువు శ్రీనాధునిపై 'సహస్రీ భావనా' అనే కావ్యం రచించారు. దీని ఇతివృత్తం శ్రీనాధుని సేవాభావనా తత్వానుసంధానం. ఈ గ్రంథోపసంహార శ్లోకంలో కవి శ్రీనాధుని 'కులదేవత' అని నమస్కరించారు. 'యద్యస్య నుచితం భావో హ్యాద్గతోఽయం ప్రకాసితః, కృతం తథాపి శ్రీనాథః కులదేవః ప్రసీదతు'. శ్రీనాథుడు వల్లభవంశానికే కులదేవత, కులపతి కావడం వాస్తవమే అయినా, ఇతని ప్రధాన సేవాధికారం శ్రీనాధుని ఇష్టానుసారం శ్రీ విఠ్ఠలేశ్వరుని జ్యేష్ఠపుత్రుడైన గిరిధర్‌జీకే ఇవ్వబడింది. ఈ సేవాధికారం ఇప్పటివరకు వారి జ్యేష్ఠపుత్రవంశంలోనే ఆ విధంగానే స్థిరంగా వుంది. వల్లభవంశంలోని ఇతరులు ఈ సేవను లేక చరణ స్పర్శను వారి ఆజ్ఞ పొంది చేయవచ్చు లేకపోతే లేదు. ఆ విధంగానే శ్రీనాథ విగ్రహము కాక ఆ విగ్రహము వలెనే వల్లభులకు సేవ్యమైనందున శ్రీనాథ విగ్రహంవలెనే నిధి స్వరూపంగా వ్యవహృతమై, శ్రీవిఠ్ఠలేశ్వరుడు తన ఏడుగురు పుత్రులకూ పంచడం వల్ల ఆయా పుత్రులకు దాయభాగంలో వచ్చిన ఏడువిగ్రహాలను, ఆయా వంశంవారే పూజించాలిగాని ఇతరులు కాదు.

# సత్యాన్వేషణము - శ్రీ రమణ ప్రబోధము

- శ్రీ జిల్లెళ్ళమూడి 'నాన్నగారు'

ప్రియమైన ఆత్మబంధువుల్లారా,

చైతన్యము నీ హృదయంలో ఉంది. చైతన్యము నేను నేనుగా వ్యక్తమయినపుడు నీవు పూర్ణస్థితిని పొందుతావు దానినే హిందువులు మోక్షం అంటున్నారు. బౌద్ధమతస్థులు నిర్వాణం అంటున్నారు. క్రైస్తవులు స్వర్గరాజ్యం అంటున్నారు. ఉన్నది ఒక్కటే వస్తువు. ఒకో మతంలో ఒకో పేరు పెట్టి పిలిచారు. ఆ స్థితిని పొందటానికి నీకు ఇతరులు అడ్డు రావటంలేదు. నీ మనస్సే నీకు అడ్డువస్తోంది. 6 సంవత్సరాలు తపస్సు చేసి దొరికాడు దొంగ అన్నాడు బుద్ధుడు. మనస్సు యొక్క మూలంలోనే సుఖం ఉంది. ఆనందము ఉంది. ఆ సుఖము, ఆనందము నాకు అనుభవంలోనికి రాకుండా మనస్సే అడ్డు వస్తోంది. మనోమూలం తెలియగానే దొరికాడు దొంగ అన్నాడు బుద్ధుడు. ఆనందము హృదయంలోనే ఉన్నప్పటికీ అది అనుభవంలోనికి రాకుండా అడ్డువచ్చేది ఆయన మనస్సే అని అప్పుడు ఆయనకు తెలిసింది.

దేవుడు ఉన్నాడా, లేడా అని బుద్ధుని అడిగితే ఏమీ చెప్పేవాడు కాదు. మౌనం వహించేవాడు. మధ్యవర్తులతో సంబంధం లేకుండా నీ హృదయంలో ఉన్న ఆనందస్థితి దగ్గరకు నిన్ను తీసుకొనిపోవడానికి బుద్ధుడు ప్రయత్నం చేసాడు. నీకు ఆనందం లేనప్పుడు, శాంతి లేనప్పుడు దేవుడు ఉన్నాడు అని చెప్పినా, లేడు అని చెప్పినా ఒక్కటే. నోటితో దేవుడు ఉన్నాడు అని చెపుతాము అనుకోండి. ధానికి సంబంధించిన అనుభవం నీకు లేనపుడు దానికి సంబంధించిన సుఖం కూడా నీకు తెలియదు. దేవుడు ఉన్నాడు, లేడు అనే సమస్యకంటే నీ హృదయంలో ఉన్న సుఖాన్ని డైరక్టుగా నీకు అనుభవంలోనికి తీసుకొని రావటానికి బుద్ధుడు ప్రయత్నం చేసాడు. ఆనందము నీ హృదయంలోనే ఉంది. నీకు దేహబుద్ధి ఉండటం వలన అది ఎక్కడో దూరాన ఉన్నట్లు నీకు అనిపిస్తోంది. నేను లోపల ఉన్నాడు. నాకు బయట ప్రపంచం ఉంది అని అనుకోవటానికి కారణం కూడా దేహబుద్ధి.

బుద్ధుడు శరీరం విడిచిపెట్టేటప్పుడు ఆయన సవతి తమ్ముడు ఆనంద్‌కు కన్నీరు వచ్చింది. బుద్ధుడు ఏ నిర్వాణ స్థితిని పొందాడో ఆ స్థితిని నీవు కూడా పొందటానికి ప్రయత్నం చెయ్యి. అంతేగాని నా గురించి విలపించి కాలమును, శక్తిని

వృధా చేసుకోవద్దు అని బుద్ధుడు ఆనంద్‌కు చెప్పాడు. వాడు బుద్ధుడు. అంటే ఏ మతం అయినా జగత్తు, జీవుడు, ఈశ్వరుడు ఈ మూడింటిమీద ఆధారపడి ఉంటుంది. మతాలు అన్నీ ఏ మూడింటిమీద ఆధారపడి ఉన్నాయో ఈ మూడూ కూడా మనస్సు యొక్క కల్పితము అన్నారు భగవాన్. మనస్సు అణిగిపోయినపుడు మనస్సును ఆశ్రయించుకొని ఉన్నవి అన్నీ కూడా అణిగిపోతాయి.

చనిపోయిన తరువాత ఏమౌతాము అని అందరూ అనుకొంటూ ఉంటారు. చనిపోయిన తరువాత ఏమౌతాము అని ఇలా అనుకొనేవారికి ఎవ్వరికీ గాఢనిద్రలో మనం ఎక్కడ ఉంటున్నాము అనే ప్రశ్న రావటం లేదు. గాఢనిద్రలో మనం ఉంటున్నాముగాని ఎక్కడ ఉంటున్నామో మనకు తెలియటం లేదు. గాఢనిద్రలో ఎక్కడ ఉంటున్నామో మరణానంతరము కూడా మనం అక్కడే ఉంటాము.

మరణించిన తరువాత వైకుంఠమునకు వెళదామని, కైలాసమునకు వెళదామని పుణ్యాలు చేస్తారు. నీవు వెళ్ళే వైకుంఠముగాని,కైలాసముగాని పారమార్థిక సత్యం కాదు. నీ మనస్సుఉ ఎంత నిజమో వైకుంఠము,కైలాసము అంతే నిజము అని భగవాన్ చెప్పారు. వైకుంఠము,కైలాసము, స్వర్గలోకము ఇవి అన్నీ కుందేటి కొమ్ము అని ఆయన చెప్పలేదు. ఇవి అన్నీ వ్యవహారిక సత్యములు. ఆ లోకములకు వెళదామనుకొనే జీవుడు ఎంత నిజమో అవి అన్నీ కూడా అంతే నిజము. చైతన్యము తప్పించి మిగిలినవి అన్నీ మనస్సు యొక్క కల్పితములు. మనస్సు అణిగితేనేగాని మనస్సు కల్పించినవి అణగవు. మనస్సు అణగటం ఎలాగ? ధ్యానం వలనగాని, విచారణ వలనగాని ఇవి రెండూ చేయలేకపోతే సత్పురుషుల సహవాసం వలన గాని మనస్సు అణుగుతుంది.

దేహం చనిపోతుంది. మనస్సు చనిపోవటం లేదు. నేను చనిపోతున్నాను అని మనస్సు అనుకొంటోంది గాని శరీరం అనుకోవటం లేదు. అదే రాంగ్ ఐడెంటిఫికేషన్. దేహముతో మనస్సు తాదాప్యం పొందుతోంది. అందువలన దేహం చనిపోయినపుడు నేను చనిపోతున్నాను అని మనస్సు అనుకొంటోంది. దేహం లేకపోయినా మనం ఉండవచ్చు. దేహము లేకపోతే మనం ఉండమేమోనని భ్రమవలన మరల జన్మ కావాలి అని కోరుకొంటున్నాము. చనిపోయిన తరువాత గొడవ వదిలివెయ్యి. గాఢనిద్రలో నీకు దేహం గొడవలేదు. అక్కడ శాంతిగా ఉన్నామా,

అశాంతిగా ఉన్నామా అంటున్నారు భగవాన్. అక్కడ శాంతిగానే ఉన్నాము. మన ఎగ్జిస్టెన్స్ అంతా దేహమునకే పరిమితమై ఉంది అనుకోవటం వలన దేహం పోతుంది అంటే భయం వస్తుంది.

మన హృదయంలో దేవుడు ఉన్నాడు అంటే మనకు ఇష్టం ఉండదు. తిరుపతిలో దేవుడు ఉన్నాడు, అరుణాచలంలో దేవుడు ఉన్నాడు అంటే మనకు ఇష్టం. అందరి హృదయాలలో నేను ఆత్మగా ఉన్నాను అని కృష్ణుడు మొదట చెప్పాడు. అది ఎవడూ పట్టించుకోడు. నేను రాముడుగా ఉన్నాను, కృష్ణుడుగా ఉన్నాడు, శివుడుగా ఉన్నాను అంటే ఇది కరెక్ట్ అనుకొంటున్నాము. ఆ గుడికి పరిగెడుతున్నాము. మనం అందరము తలకాయలో వేరు, వేరుగా ఉన్నాము కాని హృదయంలో ఒకటిగానే ఉన్నాము. అందుచేత మనం నోరు మూసుకొని హృదయాన్ని తెరిస్తే సత్యం మనకు తెలుస్తుంది. కాని మనం హృదయాన్ని మూసుకొంటున్నాము, నోరు తెరుస్తున్నాము. మన కంట్రోలర్ మన హృదయంలోనే ఉన్నాడు. మన కంట్రోలర్ ఎక్కడో తిరుపతి లోనో, అరుణాచలంలోనో లేడు. వెంకటేశ్వరస్వామి దేవుడు, అరుణాచలేశ్వరుడు దేవుడు అనుకొంటున్నాము. నీవు దేహము కాకపోయినా దేహముతో ఎలా తాదాప్యం పొందుతున్నావో అలాగ ఆరాయితో దేవుడు తాదాప్యం పొందుతున్నాడు. నీవు దేహముతో తాదాప్యం పొందటం ఎంత సత్యమో ఆ రాయితో దేవుడు తాదాప్యం పొందటం కూడా అంతే సత్యం గాని అది పారమార్థిక సత్యం కాదు.

నీవు దేహము అనుకొన్నప్పుడు, మనస్సు అనుకొన్నప్పుడు కూడా నీవు వాటికి అతీతంగానే ఉన్నావు. నీవు చైతన్యంగానే ఉన్నావు. అది నీకు తెలియకపోవచ్చును. తెలుసుకొంటే సుఖపడతావు. తెలియకపోతే దుఃఖం నిన్ను వెంటాడుతుంది. నాకు ఒక దేహము ఉంది, అని నీవు అనుకొంటే ఇబ్బంది లేదు. దేహమే నేను అనుకొంటే మాత్రం బ్రహ్మానుభవం పొందటానికి అదే నీకు అడ్డువస్తుంది అంటున్నారు భగవాన్. నీవు మాట్లాడే మాటలోగాని, నీ ఆలోచనలో గాని, నీవు చేసే పనిలో గాని నీ దేహబుద్ధిని పెంచుకుంటూ వెళితే నీకు బ్రహ్మానుభవం కలగటానికి దేహబుద్ధే ఆటంకం అవుతుంది. మనం ఏదైనా పనిచేస్తే ఆ పని దేహబుద్ధి నుండి విడుదల పొందటానికి నీకు సహకరించాలి. అప్పుడు అది యోగం అవుతుంది. నీవు చేసే కర్మనే యోగముగా చెయ్యి.

నాదిని విడిచిపెడితే చిత్తశుద్ధి కలుగుతుంది. నేనును విచిపెడితే జ్ఞానం కలుగుతుంది అని భగవాన్ చెపుతూ ఉండేవారు. నీవు దేహబుద్ధిని పెంచుకొంటూ ఉంటే సద్వస్తువు నీకు అత్యంత సమీపములో ఉన్నప్పటికీ అది నీకు తెలియదు. దేహబుద్ధిని ఎంతవరకూ తగ్గించుకొంటున్నావో బ్రహ్మానుభవం కలగటానికి అంతవరకూ అది నీకు సహాయం చేస్తుంది. నీకు దేహము తెలుసు, మనస్సు తెలుసు అంటున్నావు. వాటిని బ్రహ్మానుభవం పొందటానికి ఉపయోగించుకో. బ్రహ్మానుభవం పొందటానికి దేహమును, మనస్సును ఎంతవరకూ ఉపయోగించుకొంటున్నావో అంత వరకే నీవు జీవించినట్లు లెక్క. మిగిలినదంతా వ్యర్థమే. శాస్త్రవాసన, లోక వాసనలకంటే దేహవాసన బలీయమైనది. నీవు ఏ మార్గములో ప్రయాణం చేసినా దేహబుద్ధిలో నుండి బయటపడితేనేగాని నీకు ఆత్మబుద్ధి కలుగదు. సాధనయొక్క ప్రయోజనము ఏమిటి అంటే ఈ దేహబుద్ధి నశింపజేయటమే.

నేను గ్రంధాలు అధ్యయనం చేసాను. ఈ పాండిత్యం నాకు బ్రహ్మానుభవం కలగటానికి ఉపయోగ్ పడుతుందా అని అడుగుతున్నాడు. మానవుడు వాడు ఎవడో వాడు తెలుసుకొనేవరకూ వాడు మూర్ఖుడుగానే ఉంటాడు. వాడికి చదువు ఉండవచ్చు. అంటే వాడికి మూర్ఖత్వంతో పాటు చదువు అదనంగా ఉంటుంది. మనం వస్త్రవులు మెడలో వేసుకొని ఎలా అలంకరించుకొంటున్నామో అలాగ అహంభావనను అలంకరించుకోవద్దు.నీవు అహంబ్26ావనను అలంకరించుకోవటం మానివెయ్యి. అప్పుడు నీ హృదయంలోఉన్న చైతన్యము తానుగా నీకు వ్యక్తమవుతుంది. బ్రహ్మానుభవం పొందాలి అని అనుకొంటున్నాము కాని మనం చేసే పనులు అన్నీ అహంభావనను అలంకరించుకోవటానికి చేస్తున్నాము. గ్రంథాలు బాగా చదివాను అని చెపుతున్నావు. దేవుడు ఈ గ్రంథాలలో లేడు. నీ హృదయంలో ఉన్నాడు. నీ హృదయంలో అన్వేషిస్తే ఆయన ఎరుకపడతాడు. గ్రంథాలు చదవటం వలన పాండిత్యం వస్తుంది గాని జ్ఞానం సున్నా, నీ దేహం ఎంత నిజమో పాండిత్యం కూడా అంతే నిజం.

ఇప్పుడే ఇక్కడే ఈ దేహం ఉండగానే కాలమును పాడుచేసుకోకుండా నీవు ఎవడో నీవు తెలుసుకోవటానికి ప్రయత్నం చెయ్యి. మరణించిన తరువాత సాధన చేయటానికి ఏమీ ఉండదు. ఎక్కడో ఉంది అనుకొనేది ఇక్కడే ఉంది. కాని మనకు ఎక్కడో ఉంది అనిపిస్తుంది. ఇది మనస్సు యొక్క చేష్ట. హృదయగతంగా

ప్రయాణించకుండా ఉండటం కోసం నీ మనస్సు అలా కల్పిస్తోంది. నీ మనస్సును కొద్దిగా హృదయం వైపుకు ప్రయాణం చేయించగలిగితే ఎక్కడో ఉంది అనుకొన్నది ఇక్కడే ఉంది. ఎప్పుడో వస్తుంది అనుకొన్నది ఇప్పుడే వస్తుంది. నీ మనస్సును వెనుకకు పంపించు. నీలోపల ఉన్న చైతన్యం ముందుకు వస్తుంది. అది ముందుకు వచ్చి నీ మనస్సును స్వాలో చేస్తుంది. అప్పుడు చైతన్యం ఒక్కటి మాత్రమే నేనుగా మిగులుతుంది. అదే నిర్వాణస్థితి.

తనను తాను నాశనం చేసుకోవటానికి అహంభావన ఇష్టపడదు. నీకు పుణ్యాలు కావాలంటే చేసిపెడతాను. స్వర్గానికి వెళ్ళే పనులు కావాలంటే చేసిపెడతాను. నన్ను మటుకు విచారణ చేయకు. నన్ను మినహాయించు అని అది చెపుతుంది. దానిని ప్రశ్నించటానికి అది ఇష్టపడదు. దానిని ప్రశ్నిస్తే దానికి ఉనికి లేకుండా పోతుంది. అందువలన తనను ప్రశ్నించటానికి అహంభావన ఇష్టపడదు. దానిని ప్రశ్నించే బుద్ధి మనకు కలుగుతోంది. అంటే ఈశ్వరానుగ్రహం వలననే అది కలుగుతుంది. ఈశ్వరానుగ్రహం లేకుండా దానిని ప్రశ్నించే బుద్ధి మనకు కలుగదు.

పడుకోవటానికి పరుపు ఉంది అనుకో, తలక్రింద దెక్కా ఉంది అనుకో, పైన సీలింగ్ ఫాన్ తిరుగుతోంది. అనుకో, నిద్రపోవటానిక అన్ని సదుపాయాలు ఉన్నాయి అనుకో, అయినా నీకు నిద్ర పట్టడం లేదు అనుకో, నిద్రపట్టకపోయినా ఫరవాలేదు సదుపాయాలు అన్నీ ఉన్నాయి అని ఎవరైనా అనుకొంటారా? అనుకోరు. ఈ సదుపాయాలు అన్నీ నిద్రపట్టటం కోసం ఏ విధంగా అయితే ఉపయోగించు కొంటున్నారో అలాగే భగవంతుడు ఇచ్చిన అవకాశములను మోక్షానుభవం పొందటానికి ఉపయోగించుకో, భగవదనుభవం పొందటానికి వాటిని సద్వినియోగం చేసుకో, లేనిచో నీవు చాలా నష్టపోతావు.

ధ్యానం చేయటం వలన, విచారణ చేయటం వలన స్పిరిచుయల్ స్ట్రెంగ్త్ వస్తుంది. మనస్సుకు ఏకాగ్రత వస్తుంది. సూక్ష్మదృష్టి కలుగుతుంది. స్థూలదృష్టి ఉన్నవాడి కంటే సూక్ష్మదృష్టి ఉన్నవాడు విషయమును బాగా గ్రహించగలడు. సూక్ష్మం అయిన మనస్సు, పవిత్రమైన మనస్సు మాత్రమే హృదయాభిముఖంగా ప్రయాణం చేయగలదు. సూక్ష్మదృష్టి ఉన్నవాడు శబ్దమును ఉన్నది ఉన్నట్లుగా గ్రహించగలడు. అందులో ఉన్న నిజాన్ని సూక్ష్మదృష్టిఉన్నవాడు గ్రహించగలడు, స్థూలదృష్టి ఉన్నవాడు

గ్రహించలేడు.

గాఢనిద్రలో నీ ప్రయత్నం లేకుండా మనస్సు దాని మూలంలోనికి వెళుతుంది. జాగ్రదావస్థలో నీవు ప్రయత్నంచేసి దానిని దాని మూలంలోనికి పంపాలి. అదే సాధన. అది కేవలము నీ తెలివితేటల వలన జరుగదు. దీనికి స్వప్రయత్నం, కాలపరిపక్వము, ఈశ్వర కటాక్షం అవసరము. నీవు చేయగలిగినది చెయ్యి. నీవు చేస్తూ ఉంటే నీవు చేస్తున్న ప్రయత్నమే అనుగ్రహంగా మారుతుంది.

నీలోపల ఉన్న చైతన్యమునకు ధ్యానం అక్కరలేదు. దానికి ద్వితీయం లేనే లేదు. దానికంటే వేరుగా ఏమీ లేదు. నీ దేహానికి ధ్యానం అక్కరలేదు. ఇంక ధ్యానం చేసేది ఎవరు? మనస్సు చేస్తుంది. సాధన చేసేది ఎవరు అంటే మనస్సు. మనకు వస్తువు అనుభవంలోనికి రాకుండా అడ్డువచ్చేది ఎవరు అంటే మనస్సే. ఎవడైతే సాదన చేస్తున్నాడో ఆ సాధకుడే మనకు వస్తువు అనుభవంలోనికి రాకుండా అడ్డువస్తున్నాడు అని ముందు మనం గ్రహించాలి. నేను జపం చేస్తున్నాను, నేను ధ్యానం చేస్తున్నాను అని చెపుతున్నావు. రవ్వంత, ముల్లంత హృదయాభిముఖంగా వెళ్ళావా? ధ్యానం చేయటం మంచిదే చేయండి. కాని ఎంతసేపు ధ్యానం కుదురుతోందో చూసుకోండి. ఒక గంటసేపు ధ్యానంలో కూర్చున్నారు అనుకొండి కరెక్టుగా ఎంతసేపు ధ్యానం కుదురుతోందో చూడండి. ధ్యానం మనస్సుతో చేస్తున్నాము. ఎందుకు చేస్తున్నాము అంటే దానిని నశింప జేయటం కోసం చేస్తున్నాము. దానిని చంపటానికే ధ్యానం చేస్తున్నాము అని మనస్సు గ్రహించేసింది. అందువలన చేస్తున్నట్లుగా అది నటిస్తోంది. సాధన చేసి సాధకుడినే నశింపజేయాలి. ఏ సత్యమును నీవుతెలుసుకోవాలి అని అనుకొంటున్నావో అది నీవే. మనస్సు గొడవ వదిలెయ్యి. అది నిన్ను మోసం చేస్తోంది. అది నేను, అది నేను అని నీవు అనుకొంటున్నావు. అది నేను అనుకోవటం మానివెయ్యి. దాని అంతట అదే వాడిపోయి రాలిపోతుంది. యు ఆర్ ది ట్రూత్.

నీవు దేనినైతే పోగొట్టుకోవాలో దానినే గుర్తు తెచ్చుకొంటున్నావు. అది ఎలా పోతుంది. దానికి ఫుడ్ సప్లై అయిపోతూ ఉంటుంది. నీవు దేహముతోనూ, మనస్సుతోనూ తాదాత్మ్యం చెందే బదులు హృదయంలో ఉన్న చైతన్యంతో తాదాప్యం పొందు. అప్పుడు దానికి ఫుడ్ సప్లై ఆగిపోతుంది. అప్పుడు దానంతట అదే సన్నగిల్లిపోతుంది. నీ సంకల్పమే నా సంకల్పము, నీ ఇష్టమే నా ఇష్టం అలా శరణాగతి

మార్గం వలన కూడా మనస్సు నశిస్తుంది.

దేహము నేను కాదు అని ఉపనిషత్‌లు చెపుతున్నాయి. దేహము నేను కానపుడు దేహము నేను కాదు అని అనుకోవాలి కదా. దేహము నేను అనే తలంపు నాకు ఎందుకు వస్తోంది. పూర్వజన్మలో నీవు పుణ్యం చేసినా, పాపం చేసినా దేహము నేను అనే బుద్ధితో చేసావు. ఆ ఫలితం నీచేత అనుభవింపజేయటం కోసం దేహము నేను అనే బుద్ధిని నీకు కలుగజేసాడు. దేహము నేను అనే బుద్ధి నీకు లేకపోతే ఈ ఫలితం నీకు అనుభవంలోనికి రాదు. ఈ ఫలితం నీకు అనుభవంలోనికి రావటంకోసం నీకు దేహబుద్ధి కల్పించాడుగాని అది నిజం కాదు అని చెప్పారు. దేహం దాని ప్రారబ్ధం ప్రకారం వెళుతుంది. నీవు సాధన చేయటం వలన దానితో తాదాప్యం వదిలిపోతుంది. ప్రారబ్ధం ప్రకారం సంఘటనలు జరుగుతూ ఉంటాయి. నీవు సాధన చేయటం వలన ఈ సంఘటనల ప్రభావం నీమీద పడదు. అప్పుడు నీవు హాపీగా ఉండగలవు..

అహంభావన నుండి బయటపడటానికి పూజలు, జపాలు, ధ్యానాలు చేయవచ్చు. వాటికి కూడా ఎంతో కొంత శక్తి ఉంది. కాని వీటి అన్నిటికంటే గురువు అనుగ్రహం అత్యంత బలీయమైనది. మీ సాధన పూజగదికి పరిమితం అవ్వకూడదు. కొంతమంది భక్తి అంతా పూజగదికి పరిమితం చేసుకొంటారు. పూజగది నుండి బయటకు వచ్చిన తరువాత ఏమీ ఉండదు దైనందిన జీవితములో మీరు మాట్లాడే మాటద్వారా గాని, పని ద్వారా గాని, తలంపుద్వారా గాని అహంభావనకు ఫుడ్ సప్లై అవ్వకుండా చూసుకోండి. అప్పుడు మీకు తెలియకుండానే దానంతట అదే రాలిపోతుంది.

నీకు ధనం ఉండవచ్చు, చదువు ఉండవచ్చు, గౌరవము ఉండవచ్చు. ప్రారబ్ధంలో ఉంటే అవి వస్తాయి. వీటి వలన అవినయం తెచ్చుకోవద్దు. అవినయం తెచ్చుకుంటే బాహ్యంగా నీవు బాగా ఉన్నా మూలంలో కుళ్ళిపోతావు. భగవంతుడు ఇచ్చినదే ఇతరులకు ఇచ్చి నేను ఇచ్చాను అనుకొంటూ అహంభావనను పెంచుకొంటున్నావు. అన్నీ ఇచ్చినది భగవంతుడే. అహంభావనను పోగొట్టుకొనే శక్తి నీకు లేపోవచ్చును. కనీసం దానిని డౌట్ చేయటం ప్రారంభించు అన్నారు భగవాన్. ఉంటుందా, పోతుందా అనేది తరువాత విషయం ముందు డౌట్ చేయటం ప్రారంభించు డౌట్ చేయటం ప్రారంభించటం కూడా సాధనలో ఒక భాగమే.

(శ్రీరమణ భాస్కర - ప్రబోధ పత్రం నుంచి)

# అమృతం కురిసిన అరుణగిరి!

- శ్రీ కస్తూరి భాస్కరరావు

వినీలాకాశంలో పూర్ణ చంద్రుడు వెయ్యి ముఖాలై చల్లని కిరణాలు వెదజల్లి ఎంతో చల్లగా, హాయిగా అమృతాన్ని కురిపిస్తున్నాడు. నిండు జాబిలి వర్షించే వెలుగుల్ని చిత్రకారుడెంత కన్నుల పండుగగా చిత్రించాడు! చల్లని అనుభూతిని తాను ఆస్వాదించి, ఆ సౌరభాన్ని అందర్నీ పంచుకోమని ఆహ్వానిస్తున్నాడు. ఒక్క చంద్రుడే యింత అమృతాన్ని కురిపిస్తే వేయి చంద్రుల సుధావాహినిలో ఈదగలమా? జాబిల్లి చల్లగా, మెల్లగా చెప్పిన ఈ నిజం రసికులకు తెలుస్తుంది. రసికులంటే కవి హృదయాన్ని తెలిసిన వాళ్లు-చిత్రకారుడి రంగుల కలల్ని మధుర విలాసాన్ని స్వయంగా తెలుసుకున్నవాళ్లు, సహృదయులంటే సాహిత్యంలో అలంకారాలు తెలిసినవాళ్లు, రంగుల సమ్మేళనం తెలిసినంత మాత్రాన చిత్రకారుడి తపస్సు తెలిసినట్లేనా? ఆ అనుభవాలు, అనుభూతులు జీవితానికి అర్థం తెలిస్తే ఏనాడో అంతా మహా పురుషులయ్యేవారు. నేర్చుకున్న చదువులు జ్ఞానాన్ని, సంస్కారాన్ని యిస్తాయా? శాస్త్రాలన్నీ మనిషిని మనీషిగానో, పురుషోత్తముడో అయ్యేట్టు చేస్తాయా? పూర్ణత్వాన్ని మనిషి ఎప్పటికైనా చేరుకోగలడా? విద్య పరమార్థం, ప్రయోజనం యిదేనేమో!

దేనిని తెలుసుకుంటే విననిది కూడా వినినదే అవుతుందో, తర్కానికి నిలుస్తుందో, సంశయాలతో నిశ్చయంకానిది కూడా నిశ్చయమౌతుందో దాన్ని గురించి తెలుసుకోవటం ఎన్నడు? అది సాధ్యమేనా? - ఈ ప్రశ్నలు ఈనాడు క్రొత్తగా పుట్టినవి కావు. ఉపనిషత్తుల కాలం నుంచీ గురుశిష్య సంవాదరూపంగా మనకీనాడు లభించిన అనుభూతులు! మహర్షులు పెట్టిన జ్ఞానభిక్ష!

"కౌపీనవంతఃఖలు భాగ్యవంతః" అన్నది మన వాఙ్మయం. కౌపీనధారి ఆత్మసామ్రాజ్యాన్ని పరిపాలించే భిక్షకుడే భాగ్యవంతుడన్నాడు - 'పరమహంస పరివ్రాజకుడ'ని పేరు పెట్టారు. నిజానికి భారతీయ దృక్పథంలో గోచీపెట్టుకుని ఆత్మ సామ్రాజ్యాన్ని ఏలుకునే భిక్షుకుడే గొప్ప భాగ్యశాలి! రాజపీఠాన్ని అలంకరించిన మహాభోగి! జ్ఞానిని ఆధ్యాత్మికరంగంలో మహాభోగిగా వర్ణించారు.

ఈ భూమే పట్టె మంచంగా, తలక్రింద పెట్టుకున్న చేతులే దిండుగా, నక్షత్రాలతో అలంకరించుకున్న ఆకాశమే చాందినిగా, పూర్ణ చంద్రబింబమే దీపకాంతిగా వర్ణించారు. అతడు రాత్రి 'విరతి' అనే స్త్రీ సాంగత్యంలో నిరతిశయానందం

అనుభవిస్తారట! చిత్రమేమంటే అతడు కోరుకోకుండానే దిక్కులనే విలాసవతులు చామరాలు తీసుకుని చల్లని పిల్లగాలులు వీస్తుంటే అతడు అన్ని సంకల్పాల్ని సన్యసించి విశ్వానికి సార్వభౌముడయ్యాడట! ఎంత చిత్రమైన వర్ణన!

ఛాందోగ్యఉపనిషత్తులో ఒక కథ వుంది - ఉద్దాలక మహర్షి పుత్రుడు శ్వేతకేతువు. బాల్యమంతా ఏవిద్యా వ్యాసంగం లేకుండానే వ్యర్థంగా గడిచిపోయింది. పుత్రుని చూచి మహర్షి -

"శ్వేతకేతోవసబ్రహ్మచర్యంనవైసోమ్యఅస్మత్కు
లీనఃఅననూచ్యబ్రహ్మబంధురివభవతి"-

నాయనా! నీకు యిప్పటికి పన్నెండు సంవత్సరాలొచ్చాయి. కాని నీవు విద్యార్థివి కాలేదు. ఇప్పుడైనా శ్రద్ధతో విద్యని అభ్యసించకపోతే నిన్ను తోటివారు నీచంగా 'బ్రహ్మబంధు' వంటారు. ఇంతవరకూ మన వంశంలో నీవంటివాడు పుట్టి వుండలేదు' - అన్నాడు ఉద్దాలకుడు.

ఈ మాటలు విన్న శ్వేతకేతువుకి రోషమొచ్చింది. తండ్రి దగ్గర విద్యను అభ్యసించదలచుకోక వేరొక పండితుడిని ఆశ్రయించి పన్నెండు సంవత్సరాలు సేవచేసి సర్వవిద్యల్లో పారంగతుడయ్యాడు. ఇరవై నాలుగోఏట యింటికి తిరిగి వచ్చాడు. అహంభావంతో గౌరవం చూపక, తండ్రి కంటేతాను గొప్ప విద్యాంసుడిననే అహంకారంతో వున్నాడు. అల్పజ్ఞానంతోనే మదపుటెనుగులాగా గర్వించాడు. విద్య, విజ్ఞానం వున్న పుత్రుడిని ఏ విధంగా శిక్షించాలో మహర్షికి బాగా తెలుసు. శ్వేతకేతువుని తండ్రి ప్రశ్నించాడు-

"యేనఅశ్రుతగ్ంశ్రుతంభవతి అమతం మతం
అవి జ్ఞాతం విజ్ఞానమితి?"- అంటే దేన్ని తెలుసుకుంటే విననిది కూడా విన్నదే అవుతుందో, తర్కింపనిది కూడా తర్కానికి అందుతుందో సంశయాలతో నిశ్చయం కానిది కూడా నిశ్చయమౌతుందో దాన్ని గురించి నీ గురువుని అడిగావా?

తండ్రి తనని ఎగతాళి చేస్తూ ప్రశ్నించాడని అనుకున్నాడు. లోకంలో ఏవిషయాన్ని గురించి తెలుసుకుంటామో ఆ పదార్థవిజ్ఞానమే కలుగుతుంది గాని వేరే పదార్థ జ్ఞానాన్ని ఎలా తెలుపుతుంది?

కుమారుడు అడిగాడు 'హే భగవాన్! ఒక పదార్థ జ్ఞానం యింకొక పదార్థాన్ని ఎట్లా తెలుపుతుంది? మట్టితో చేయబడ్డ కుండలు మొదలైనవన్నీ మట్టి వికారాలే అని-తెలియాలంటే ముఖ్యంగా మట్టి స్వరూపం తెలియాలి. ఒక విషయాన్ని తెలుసుకుంటే

సర్వం ఎట్లా తెలుస్తోందో వివరంగా చెప్పాడు. సత్యం బోధపడగానే శ్వేత కేతువు విద్యాగర్వం పూర్తిగా పోయి తండ్రి పాదాల మీద పడి తత్త్వ రహస్యాన్ని చెప్పమని వేడుకుంటాడు. తండ్రి దయతలచి ఆత్మతత్త్వాన్ని బోధిస్తాడు. అధిష్ఠాన జ్ఞానమైన ఆత్మతత్వం తెలిస్తే జగత్కార్య స్వరూపం తెలుస్తుందని దీని సారాంశం!

మంత్రం॥ 'సర్వవ్యాపినమాత్మానంక్షీరేసర్పరివార్పితమ్

ఆత్మవిద్యాతపోమూలంతద్బ్రహ్మోపనిషత్‌పరమ్॥-

- ఆత్మ జ్ఞానం, తపస్సు - ఈ రెండే ఆత్మ సాక్షాత్కారానికి సాధనాలు. సత్యము, తపస్సు ద్వారానే, పాలలో కలిసివున్న వెన్నలాగా అంతటా వ్యాపించి వున్న పరమాత్మను దర్శించగలుగుతాము. అజ్ఞానాన్ని నిర్మూలించటానికి ఇవే సాధనాలు!

ఇది బ్రహ్మవిద్య - మన ఉపనిషత్తుల్లో గూఢంగా ఉంది. దీన్ని అధికారి అయిన శిష్యునికో, పుత్రునికో ఉపదేశించాలన్నారు. అధికారి ఎవరంటే - ఎవరి మనస్సు రాగద్వేషాలు, మాలిన్యాలు లేకుండా స్వచ్ఛంగా వుంటుందో వారికే ఈ పరమ రహస్యమైన బ్రహ్మవిద్యను బోధించాలని మన ఆర్షవిద్యాసాంప్రదాయాల రక్షణ కోసమే మహర్షులు చెప్పారు.

తపస్సంటే మనస్సుతో, మనస్సులో, మనస్సునే ప్రయోగశాల చేసుకుని అంతర్ముఖుడై చేసే ప్రతిక్రియా తపస్సే! అది తీక్ష్ణ విచారణాశక్తి! మనస్సు నిర్మలినమై,రాహిత్యం చెందటం వల్ల జీవభావం నశించి, స్వయంప్రకాశమైన ఆత్మే మిగులుతుంది. అప్పుడే అమృతత్వం, శాశ్వతానందం లభిస్తుంది. తపస్సు మనలోని దివ్యత్వాన్ని పైకి తెస్తుంది. ఇంద్రియాల్ని నిగ్రహించి, కోరికల్ని జయిస్తే శాంతి లభిస్తుంది. శాంత మనస్కుడే ముముక్షువు కాగలడు. అవిద్య, అజ్ఞానం నశిస్తే మన నిజస్వరూపం తెలుస్తుంది. ఆ అంధకారాన్ని పారతోలటానికి జ్ఞానదీపికే కావాలి.

అంతర్ముఖ దృష్టి లేనివాళ్లు శుద్ధ చిత్‌నే చూడలేరు. బాహ్యదృష్టి మాని, లోచూపుతో చూడాలి. చిదాత్మను మించిన జ్యోతి యింకొకటి లేదు. అది సర్వప్రకాశకం! సూర్యునికి కూడా ప్రకాశమే! సర్వప్రకాశిక అయిన త్రిపురా పరమేశ్వరి అన్ని వేళలా, అన్నిచోట్లా ప్రకాశిస్తోంది. ఆ శుద్ధ జ్ఞానాన్ని చూడలేక అంతా మోహంలో పడుతున్నారు. మనస్సు సంకల్పాన్ని త్యాగం చెయ్యనంతవరకూ అంతర్ముఖ దృష్టి రాదు. అంతర్‌దృష్టి లేనంతకాలం శుద్ధ చిత్స్వరూపదర్శనం కలుగదు. అంతర్‌దృష్టి అంటే సంకల్పాలు లేకపోవటమే. ఇదే విషయాన్ని అష్టావక్రగీతలో తాపసి జనకుడి సభలో ప్రశ్నిస్తుంది. -

(మిగతా వచ్చే సంచికలో)

# అనుభవతరంగిణి

- శ్రీ జి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ

(గత సంచిక తరువాయి)

"ఆరోజు స్వామీజీ 48వ జన్మదినం. సాయంత్రం సభలో 'విశ్వగీతి క్యాసెట్లు' లోని పాటలు పాడాలి. ఆర్టిస్టులంతా కొత్తవాళ్లు గుంటూర్లో శ్రీ జి.రామారాయుడిగారి గెస్ట్‌హౌస్‌లో పాటలు రిహార్సలు చేస్తున్నాను. మా శ్రీవారు డాక్టర్ పి. నందకుమార్‌గారు స్వామీజీ దగ్గరకు వెళ్ళారు. ఆయనను చూచి స్వామీజీ "శోభను త్వరగా రమ్మను" అని చెబితే, ఆయన నాకు ఫోన్ చేశారు. రిహార్సలు పూర్తికాకపోవటం మూలాన ఎంత త్వరగా పోదామనుకున్నా నాకు వీలుపడలేదు. నేను విశ్వమందిరానికి వచ్చేటప్పటికి మధ్యాహ్నం దాటింది. అంతా పైన భోజనాలు చేస్తున్నారు. క్రింద స్వామీజీ కూచోని ఉంటే దగ్గరకుపోయి పాదనమస్కారం చేశాను. అక్కడున్నవాళ్ళు భోజనానికి పైకి వెళ్ళమంటే పై అంతస్థుకు వెళ్ళాను. అక్కడ ఖాళీ లేదు. "కాసేపు కింద కూచోండి, పిలుస్తాం" అన్నారు అక్కడి వాలంటీర్లు. పైకి రమ్మని పిలిచి, తీరా వచ్చింతరువాత "ఖాళీ లేదు. క్రిందకు పోయి కూచో" మంటే మామూలు పరిస్థితుల్లో అయితే అగౌరవపరచినందుకు చాలా బాధవేసేది... కోపం వచ్చేది. కానీ అప్పుడు నాకు కోపం రాలేదు. "స్వామీజీ పరీక్ష పెడుతున్నా"రనిపించింది - నన్ను రమ్మనంగానే వెంటనే రాక ఆలస్యంగా వచ్చినందుకు. ఆ తర్వాత భోజనానికి కూచున్నాను. స్వామీజీ నా దగ్గరకు వచ్చి నేను భోంచేసే ముందుగా ప్రసాదం నా చేతిలో పెడతారని అనుకొని ఎంతో సేపు ఆశగా ఎదురుచూచిన నాకు ఆశాభంగం కలిగింది. ఎంతసేపటికి స్వామీజీ వచ్చే సూచన కనిపించకపోయేసరికి "ఇహ లాభంలే"దని భోజనం చెయ్యటం మొదలుపెట్టాను. కాసేపటికి స్వామీజీ నా దగ్గరకు వచ్చి "పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకొని మనస్సు పాడుచేసుకోకు! ఎప్పుడూ నీతోనే ఉంటాను .. ఏంఫరవాలేదు" అన్నారు. ఆ మాటలు వినంగానే "మాయ నన్ను కమ్మినప్పుడు, బాధ పీడించినప్పుడు, తోడు నీడవై నీవు నన్నాదుకొందువా?" అని క్యాసెట్టులో పాడిన పాటలోని భావం నా మదిలో తళుక్కుమంది. ఆ పాటలోని నా ప్రశ్నకు స్వామీజీ ఆ విధంగా జవాబివ్వటం చూడంగానే సంతోషం వేసింది. విప్పారిన కళ్ళతో తేలికపడ్డ మనస్సుతో స్వామీజీ వైపే కళ్ళప్పగించి పిచ్చిదానిలా చూస్తుంటే "సాయంత్రం పాటలు పాడాలి గదా! ఆలస్యం

చేస్తే ఎట్లా? ఊ .... ఊ ... త్వరగా భోంజేసి వెళ్ళి రిహార్సల్సు చూసుకో!" అన్నారు స్వామీజీ. అప్పుడు "ఇది నిజంగా స్వామి పరీక్షే!" నన్న సంగతి నాకు బుజువైంది.

ఆ సంఘటన జరిగినప్పటి నుంచి శ్రీమతి శోభారాజ్‌లో చాలా మార్పు వచ్చింది. ఆమె భక్తిలో మార్పు వచ్చింది. అవగాహనలో మార్పు వచ్చింది. ఏదైనా ఒక అనుభవం కలిగినప్పుడు "ఇది పరీక్షే!" అని భావించి, దాన్ని ఎదుర్కొనే స్థైర్యం ఆమె మనస్సుకు కలిగింది. "స్వామీ! నీ పరీక్షకు తట్టుకోలేను. నీ రక్షణ కావాలి" అని నిత్యం ఆమె స్వామిని ప్రార్థిస్తూ ఉంటుంది. గొంతు బిగపట్టిందనిపించినప్పుడుగాని, ఏదైనా చిన్న సమస్య తలెత్తినప్పుడుగాని వెంటనే ఆమె స్వామీజీకి ఫోన్ చేస్తే, స్వామీజీ "విభూతి నోట్లో వేసుకో! ... నామ జపం చేసుకో!" అని ఆమెకు ఆదేశాలిస్తుంటారు. దాంతో ఆమె సమస్యలన్నీ పరిష్కారమౌతుంటవి.

"స్వామి కార్యక్రమంలో ఒక ఉపకరణంగా నన్ను ఉపయోగించు కొంటున్నారు. వారెట్లా ఆజ్ఞాపిస్తారో? ఏ రకమైన అనుభూతి కలిగిస్తారో? అట్లా ఆచరించటమే నా విధి. వారి ఆశీస్సులు పుష్కలంగా నాకున్నవనే విశ్వాసమే, సంతృప్తే నన్ను ముందుకు నడిపిస్తున్నది - ఉత్సాహం కల్పిస్తూ. స్వామీజీ పాదస్పర్శ లభించిన తర్వాతనే నా పరపతి పెరిగింది. పాటలు పాడే ప్రావీణ్యం ప్రబలమైంది. వారి దివ్యాశీస్సుల ఫలితమే! - తిరుమల తిరుపతి దేవస్థానంవారు అన్నమాచార్య ప్రాజెక్టుకు నన్ను అడ్వైజర్‌గా నియమించటం" అంటుంది ఆ మధుర గాయని శ్రీమతి శోభారాజ్.

*(సశేషం)*

# అదే విశ్వనగరం !

- డా॥ జంధ్యాల జయకృష్ణ బాపూజీ

అదే విశ్వనగరం
ఇదే దివ్యశిఖరం
మానవతా మహనీ
యుని మనోమందిరం ॥అదే॥

విశ్వగురువు విహరించెడి
విమలమైన ఉద్యానం
ఆది ఋషుల వాక్కులతో
అమలమైన సద్యానం ॥అదే॥

అంధకార జగతి లోన
జ్యోతిర్మయ మగు మార్గం
తలుపు లెపుడు తెరచియుండు
భువిలో వెలసిన స్వర్గం ॥అదే॥

అవినీతిని అడ్డగించు
ధర్మచక్ర మదే కదా
అక్రమమును ఖండించెడి
దివ్యఖడ్గ మిదే కదా ॥అదే॥

అంధులనే ఆదరించు
మమతామయ మధుసదనం
పాంధులనే పలుకరించు
సమతాప్రియ జయవదనం ॥అదే॥



# శ్రీ రామకృష్ణుని దివ్యభాషణములు

స్త్రీ తనకు తన మగనికి జరిగెడు రహస్య సంభాషణము తనకు మిక్కిలి నమ్మిక గల చెలిమికత్తెలకు మాత్రమే చెప్పును గాని యితర స్త్రీలకు చెప్పదు. అట్లే పరమ భక్తుడు సర్వేశ్వర సాంగత్యము వలన తనకు గలిగిన సాంద్రానందమును భక్తునకే తెలియజేయును. కాని యితరుల కెరుగ,ఏయడు. అది చెప్పినదాక వాని కొక్కప్పుడు తోచదు.

భంగు త్రాగువాడు పదిమందిని గూడుకొని త్రాగినట్లే సద్భక్తుడు తానొంటిగా నీశ్వర కీర్తనము చేయజాలడు.

తర్కశాస్త్ర పండితు డొకడు శ్రీ రామకృష్ణ పరమహంస యొద్దకు బోయి

"జ్ఞానము, జ్ఞాని, జ్ఞేయము ననగా నేమి" యని యడిగెను. ఆ పరమహంస వానికిట్లనియె : ఈ వాస్త్ర చర్చా చమత్కారములను నేనెరుగను. నేను జగజ్జననియైన దేవి నొక్కతినే యెరుగుదును. నే నామె పుత్రుడను.

నాచు ప్రవాహము గల నదులలో మొలవదు. అది ప్రవాహము లేని చిన్న చెరువులు మొదలగు వానిలో మొలుచును. ఆలాగే నిర్మలములై విశాలములై స్వార్థపరాయణ లేని మనుష్యులు నడుపుచున్న సంగములలో భేదములు పుట్టవు కాని యంతఃకరణ శుద్ధి లేక స్వార్థపరాయణులై యుండు మనుష్యులు నడుపునట్టి సంఘములలో నవి స్వేచ్ఛగా బెరుగును.

యోగిమహిమ పరమయోగి యెరుగును. నూలు వర్తకుడు నూలికట్ట చేత బట్టుకొని యది యెన్నవ నెంబరు నూలో చెప్పగలడుగాని మరియొకడు చెప్పజాలడు.

"ఉత్తములు తాము చేసే నిష్కామ్య సత్కార్యాచరణకు
నిద్ర వల్ల కాలం వృధా పోరాదని
చాలా భాగం నిద్రను దూరం చేస్తారు."
- శ్రీ రమణ మహర్షి

దివ్యయోగి చరితామృతం

# శ్రీ నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రనాథులు

(1788-1907)

- ఆచార్య బి. రామరాజు

నిరాకారుడైన భగవంతుడు సాకారుడై గురు రూపంలో సాక్షాత్కరిస్తాడు. అజ్ఞానులనే గుడ్డివారికి జ్ఞానాంజనం ప్రసాదించి కనులు తెరిపిస్తాడు. ఆ కొత్త చూపులతో జీవితయాత్ర చేసేవారికి ఇహపరములు రెండూ సుఖప్రదములు సులభములు ఔతాయి. అట్టి దైవాంశ సంభూతులయిన గురువుల్లో శ్రీ నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రనాథులొకరు. కన్నడ దేశంలో పుట్టి ఆసేతుహిమాచలం యోగభూములు మెట్టి, సమస్త యోగమార్గాలలో ఆరితేరి, అన్ని ప్రాంతాల శిష్యులకు భక్తులకు జ్ఞానభిక్ష పెట్టి, ఆశ్రితుల పాలిటి పారిజాతమై, హైదరాబాదులో సిద్ధిపొందిన ఆ మహాయోగి చరిత్రం చాలా సంగ్రహంగా తెలియవస్తున్నది. హైదరాబాదు నగరం సుల్తాన్‌బజారులో బడీ చావిడీ వెనుక మోతీసింగ్ సందున్నది. ఆ సందులో శ్యామాపంతుల గోపాల్రావు (ఆ కాలం కస్టమ్స్ కమీషనర్) ఇంటి కెదురుగా శ్రీ నీళకంఠ సచ్చిదానంద స్వాముల మఠం ఉన్నది. సంగ్రహంగా దానిని సచ్చిదానంద మఠ మంటారు. మఠం క్రింది భాగంలో శ్రీ సీతారామచంద్రుల మందిరం, ప్రక్కన స్వామి వారి సమాధి మందిరం, వీటి వెనుక యజ్ఞావరణం, దానిని ఆనుకొని పాకశాల, ఉగ్రాణం, పూజారి ఇల్లు, స్నానశాల ఉన్నవి. పైభాగంలో మూడు హాల్సు, మూడు చిన్న గదులు ఉన్నవి. మఠం భక్తులు శిష్యులు ఆరాధనోత్సవాలకు, శరన్నవరాత్ర్యుత్సవాలకు వస్తే మేడపైన ఉంటారు. వాళ్ళ పిల్లలు నగరానికి చదువులకోసం వచ్చినవారు ఈ మేడపైన ఉంటారు. 1947-1949 సంవత్సరాల్లో నేను బి.ఎ. చదువుతున్నప్పుడు ఈ మేడపై గదిలో ఉన్నాను. ఖమ్మం జిల్లా భక్తులు సర్వదేవభట్ల, మాదిరాజు, కల్వల మొదలైన కుటుంబాలవారి పిల్లలు నా సహాధ్యాయులుండటం చేత వారి మూలంగా నాకు ఆ మఠంలో ఆశ్రయం లభించింది. మేము ఒక చిన్నగదిలో వంటచేసుకొని పెద్దహాలులో విశ్రమించేవారం. మఠంలో జరిగే ఉత్సవాలపుడు మా వంటగది మూతపడేది. మాకు మఠంలోనే షడ్రసోపేతమైన భోజనాలు లభించేవి. ఆంధ్ర

కర్ణాటక తమిళ మహారాష్ట్ర ప్రాంతాల నుండి శ్రీ సచ్చిదానందుల ఆరాధనోత్సవాలకు, శరన్నవరాత్ర్యుత్సవాలకు వచ్చిన పండితులు శ్రీ విద్యోపాసకులు మేడపైన మాతో పాటుండేవారు. కాళిదాసు చిద్గగన చంద్రికకు దివ్యచకోరి వ్యాఖ్యానం వ్రాసిన మహాపండితులు కజ్జా అగ్గన్న శాస్త్రిగారు, మాతోపాటుండేవారు. ఇంకా అద్లూరి సీతారామశాస్త్రి, వేలేటి రాఘవశాస్త్రి, శివప్ప చయనులు వచ్చేవారు. నూకల సత్యనారాయణ శాస్త్రి శ్రౌతిగారు యజ్ఞాలు చేయించేవారు.

పూజారి వరెం లక్ష్మీనారాయణ ఆయన భార్య రుక్మిణమ్మ, మఠం కార్యనిర్వహణాధికారి సమ్మెట గురుప్రసాదనాయుడు (ఈయన ఆ స్వామి ప్రసాదమే) ఆయన భార్య లలితమ్మ, పనిమనిషి నీలమ్మ, భక్తులు కృష్ణవేణమ్మ, జగన్నాథం పిళ్ళై మొదలైనవారంతా, తల్లిదండ్రులను స్వగ్రామాలను విడిచివచ్చి ఇక్కడ వండుకొని తింటూ పైచదువులు చదివే మావంటి విద్యార్థులపై ప్రేమాభిమానాలు- దండిగా వర్షించేవారు. పండుగలకంతా మా విద్యార్థులకు మంచిభోజనాలు లభించేవి. అమావాస్యకో పున్నమికో సమాధి మందిరంలోకి పోయేవారం. మాకు అక్కడి పూజలు ఉత్సవాలకంటె భోజనాల పైనే మక్కువ ఎక్కువ. ఒక మహానుభావుని సమాధి మందిరంలో ఉండి కూడ ఆయన మహిమ నేను (మేము) ఆనాడు గుర్తించలేదు. కమలం దగ్గర ఉండే కప్పవంటిదైనది నా జీవితం. ఇన్నాళ్ళకు ఆ మహానుభావుని చరిత్రం చదువుతుంటే జీవితంలో ఎంత గొప్ప అవకాశం పోగొట్టుకున్నానో అని బాధ కలుగుతున్నది. ఇన్నాళ్ళకైనా ఆ మహాత్ముని స్మరించే అవకాశం కలిగినందుకు సంతోషిస్తూ ప్రస్తుతానికి వస్తాను.

మైసూరు రాజ్యం చిక్కమగళూరు తాలూకా దానమాస అనే గ్రామంలో భారద్వాజులు, భక్తి నిష్ఠాగరిష్ఠులు, వైదికాచార సంపన్నులు, స్మార్త బ్రాహ్మణులు, లింగాంబా మల్లపార్యులు. వారి సంతానం శంకర నారాయణ, ఆయన భార్య తుంగమ్మ. ఆ దంపతుల సంతానం గోపాల పండితుడు. ఆయన భార్య అప్పన్న దీక్షితుల కూతురు భాగీరథి. వాళ్ళు దైవచింతనాపరులు, అతిథి అభ్యాగతులకు అన్నవస్త్రాదు లిచ్చి ఆదరించే పుణ్యాత్ములు. హరిపూజలోను, వేదార్థవివరణంలోను, ధర్మమార్గానుసరణంలోను, బంధుమిత్రులను యాచకులను సంభావించటంలోను, సాధుసత్పురుషులను సేవించటంలోను, గోపాల పండితునికి గోపాలపండితులే

సాటి. ఆయనకు చేదోడువాదోడు భాగీరథమ్మ. దేవహూతి కర్దములకు కపిలుని వలె, అనసూయాత్రి దంపతులకు దత్తాత్రేయునివలె, భాగీరథీ గోపాలపండితులకు శా.శ. 1710 కీలక సంవత్సరం (క్రీ.శ.1788) ఆషాఢ బహుళ షష్ఠి శనివారం ఒక సుపుత్రుడు జన్మించాడు. అతడే మన కథానాయకుడు శ్రీ నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రనాథులు. శిశువుకు తొలుత నంజుండయ్య అని నామకరణం చేసినారు. ఐదవయేట (1792) పరీధావి కార్తిక మాసంలో గోపాల పండితుడు నంజుండయ్యకు అక్షరాభ్యాసం చేయించినాడు. నంజుండయ్య 12 ఏండ్ల బాలుడయ్యేటప్పటికి ఆనాటి పండితులచేత అసమానమేధావి అని ప్రశంసలందుకున్నాడు.

త్రికాలజ్ఞులైన సద్గురువులు శిష్యులను వెదుక్కుంటూ వస్తారట. ఆకాలంలో పరమహంసోత్తంసులని ప్రఖ్యాతి గాంచిన శ్రీ రామానంద ఘనేంద్రులనే యోగి దేశ సంచారం చేస్తూ అనేకులను జ్ఞానులనుగా దిద్దితీర్చుతుండగా వారి దివ్యదృష్టికి నంజుండయ్య గోచరించినాడు. ఈ రామానందుల గురుపరంపర చాలా గొప్పది. ఆదినాథుల శిష్యుడు శివానందులు, ఆయన శిష్యుడు మహాప్రకాశానందనాథులనబడే మత్స్యేంద్రనాథులు, ఆయన శిష్యుడు మహేశ్వరానందనాథులనబడే గోరక్షనాథుడు, ఆయన శిష్యుడు శాంభవానందనాథులు, ఆయన శిష్యుడు గౌడపాదాపరాఖ్యగల మృగేశానందనాథులు, ఆయన శిష్యుడు కుంకుమానందనాథులు, ఆయన శిష్యుడు దేశికానందనాథులు, ఆయన శిష్యులే శ్రీరామానందఘనేంద్రనాథులు. వారి శిష్యుడు మన కథానాయకుడు నీలకంఠ సచ్చిదానందులు. వారి శిష్యుడు త్ర్యంబక బాలచింతామణి, గౌరీపురం చింతామణీ పీఠం అధిపతి. శ్రీరామానందులు దానమాన గ్రామం ప్రవేశించి గోపాల పండితుని ఇంటికి వచ్చినారు. అప్పుడు ఇంటి వద్ద గోపాల పండితుడు లేడు, నంజుండయ్య లేడు. శ్రీరామానందులు ఒక కాగితం చుట్ట భాగీరథమ్మ చేతికిచ్చి "దీనిని మీ చిన్నవానికివ్వండి" అని ఆజ్ఞాపించి అదృశ్యులై పోయినారు. నంజుండయ్య ఇంటికి రాగానే తల్లి ఆ కాగితం చుట్ట కొడుకు చేతి కిచ్చి, వచ్చిపోయిన ఆ మహాయోగి వైనం తెలిపినది. కాగితం విప్పి చదువుకున్న నంజుండయ్య హృదయకుహరంలో ఒక వెలుగు తలుక్కుమన్నది. తీవ్రవైరాగ్యం ఉద్బుద్ధమైనది. నంజుండయ్య తల్లిదండ్రుల అనుమతి పొంది శ్రీరామానందులను వెదుక్కుంటూ బయలు దేరినాడు. తిరిగి తిరిగి చాముండేశ్వరీ కొండగుహలో ఆ మహానుభావుడున్నట్లు తెలిసి ధైర్యంగా గుహలో చొచ్చినారు.

*(మిగతా వచ్చే సంచికలో)*

